# తొలిపలుకు

విశ్రాంతి కొఱకు మైసూరు వెళ్ళియుండఁగా బ్రహ్మశ్రీ మైసూరు వెంకటకృష్ణయ్యగారు రచించిన కన్నడగ్రంథములలో నొకటియగు 'పతివ్రతావిజయము' నాకంటఁబడెను. దానిలోని పాత్రరచన పాశ్చాత్యానుసరణములై దోషరహితముగ లేకున్నను, నాగ్రంథ మనేకవిధములఁ బాలబాలికలకు నీతిబోధకము కాకపోదని భావించి, దీని నావశ్యక మగు సవరణలతో భాషాంతరీకరించితిని. నీతిబోధకమై పాఠకులకు తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, విద్యావిచారణాధికారులును, ఈ పుస్తకమును ప్రోత్సాహింతు రని నమ్ముచున్నాను.

బ్రహ్మశ్రీ వెంకటకృష్ణయ్యగారు తమ పుస్తకము నాంధ్రములోనికిఁ బరివర్తనము చేయుటకు నాకనుజ్ఞ నిచ్చియుండిన వారికి నేను సర్వదా కృతజ్ఞుఁడను.

ఈ పొత్తమును వ్రాయునపుడు పెక్కుతీరుల నాకుఁదోడ్పడుట యేకాక, యమూల్యమగు నుపోద్ఘాతముఁ వ్రాసి ప్రసాదించిన శ్రీ మైసూరు మహారాజుగారి సంస్థానాధికారులలో సుప్రసిద్ధాంధ్రపండితులైన సాహిత్యసంగీత సరస్వతి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికి నా వందనశతంబు లర్పించుచున్నాను.

రాజమహేంద్రవరము,
6—2—31.

గ్రంథకర్త,
మహాకాళి సుబ్రహ్మణ్యము.

# ఉపోద్ఘాతము.

'పరంతపవిజయము' అను నీ అపరాధపరిశోధకకథ మొదట కన్నడభాషలో శ్రీ యమ్. వెంకటకృష్ణయ్యగారు రచించిరి. మైసూరురాజ్యమందు ఈ యేబది యేండ్లలో జరిగిన రాజకీయ సాంఘికోద్యమములలో శ్రీ వెంకటకృష్ణయ్యగారు పాల్గొననిది లేదన్న నత్యుక్తి కాదు. కన్నడమున వారనేకోపయోగిగ్రంథములను రచించినారు. అనేక పత్రికలు నడపినారు. ఇంచుమించు తొంబదియేండ్లు చెల్లుచున్నను, నేటికిని వారికార్యశూరత యకుంఠితముగా నున్నది.

పాశ్చాత్యుల కథారచనపద్ధతి ననుసరించి దేశభాషలలోఁ గూడ నట్టివి వ్రాయుట కారంభించిన పూర్వకాలపువారి ప్రథమరచనలలో నిది యొక్కటి. పడమటిసీమవారిలో నీవిద్య చాల నభివృద్ధి చెందినది. మహాకావ్యముల నందగిన గ్రంథములు పెక్కులు ఇట్టికథలు నాభాషలలోఁ గలవు. ఆకస్మికముగా నట్టివి వ్రాయ వాడుకలేనివారు వ్రాయ దొరకొనునప్పుడు కథాకథనము, పాత్రరచన, సల్లాపములు మొదలగు వానియందు అక్కడక్కడ లోటుపడుట సహజము. ఈగ్రంథమునందును అట్టి వెన్నియో కలవు.

ఇందలి కథ అద్భుతములతో నిండినది. పాత్రములును సాధారణ ప్రపంచమునకు మీరాటినవారు. సల్లాపములు కథ నడిపించుటకు పనికివచ్చినంత పాత్రస్వరూపవర్ణనమున కుపయోగింపవు. ఈవిషయమున తరువాత కర్ణాటకకథకు లెక్కువ ముందువడినారు.

ఐనను, ఉదారభావములుగల పాత్రములు విచిత్రములై రోమాంచజనకములగు సన్నివేశములు గలిగి యీకథ చదువుట కింపుగా నున్నది. శౌర్యము, సత్యము, ధైర్యము, ఔదార్యము మొదలగు

సుగుణములు చాల శ్లాఘింపఁ బడినవి. మంచికి జయము, చెడ్డకు పరాజయమును పర్యవసానమున నిర్వహింపఁబడి చదువరులకు నెమ్మది నిచ్చుచున్నవి.

దీనిని తెనిఁగించిన శ్రీమహాకాళి సుబ్రహ్మణ్యముగారు ఆంధ్ర లోకమునకు చిరపరిచితులు. విద్యాశాఖలో చాలకాల ముపాధ్యాయులుగను, పరీక్షకులుగను పనిచేసిన యనుభవజ్ఞులు. పాఠశాలలలోని వెవ్వేఱు తరగతుల విద్యార్థుల కుపయోగించు పెక్కుగ్రంథములను వ్రాసి వాసిగన్నవారు. మైసూరుదేశమునకు విశ్రాంతి ననుభవించుటకై వచ్చియుండియు, వ్యవహారోపయోగమునకై కన్నడము నేర్వఁ బ్రియత్నించినపుడు ఆకస్మికముగా కంటఁబడిన యీగ్రంథము పాఠశాలలలోని తెనుఁగుబాలుర కుపయోగించు నని గుర్తించి, వెంటనే సహజమైన కార్యశూరతతో దీనిని తెలిఁగించిరి. అందును మక్కికి మక్కిగాఁ దెనిఁగింపక యథాయోగ్యముగా సాధ్యములైన మార్పులందందుఁ జేసిరి. ప్రాఁతక్రొత్తతెలుఁగులు రెంటిని వదలి మధ్యమశైలిలో బాలురకు భాషాజ్ఞాన మలవడుటయే ప్రధానోద్దేశముగ నుంచుకొని యిది రచింపఁబడినది.

ఆంధ్రలోకము దీనిని యథాయోగ్యముగ నాదరించి భాషాంతరీకర్తగారి పరిశ్రమము సఫలము చేయుదుఁగాక యని నాకోరిక.

మైసూరు,
19-1-31

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

శ్రీ

# పరంతపవిజయము.

---:o:---

## అధ్యాయము. 1.

---)o(---

భరతఖండమున నీశాన్యభాగమున గంధర్వపుర మనునగర మొకటి భాసిల్లుచుండెను. అయ్యది ద్యూత పాన వ్యభిచారాది దుర్వృత్తులకు నాటపట్టయి యుండెను. స్తేయము మున్నగు దుష్కార్యముల మూలమున ధన మార్జించి, ద్యూతవ్యభిచారములకు దానిని వ్యయపఱచువారనేకు లాపట్టణము నలంకరించి యుండిరి. అచ్చటి ద్యూతగృహములు విశాలములై సౌధములవలెఁ గనఁబడుచుండును. ఆగృహములందు క్షణక్షణము కోటానఁగోటులగు నాణెము లొకరిని విడిచి మఱియొకరిఁ జేరుచుండును. భాగ్యలక్ష్మి చపలత్వమును నిరూపించుట కానగరమునందు పెక్కుదృష్టాంతములు దొరకుచుండెను. ఆపట్టణమధ్యమున నున్న హర్మ్యములలో విశేషశోభావంత మగు భవనమొకటి ద్యూతగృహరాజమై యొప్పుచుండెను. ఆయింటి యజమానుఁడు తనయింట జూదమాడి గెలుపొందినవా రందఱును తాము గెల్చిన సొమ్మునందు ఇరువదవ భాగము తన కీయవలసిన యేర్పాటు చేసియుండెను. ఇట్లు సంపాదించు ద్రవ్యమే మాసమునకు దాదాపు సహస్రరూప్యము లగుచుండెను. అతఁ డీద్రవ్యములో తన సొంతమునకు సగ ముంచుకొని శేషమును ద్యూతకారసౌకర్యార్థము వినియోగించుచుండెను. ఈగృహమున క్షణముండుట పెక్కు వత్సరముల స్వర్గానుభవముతోఁ దులదూఁగునని యచ్చటికివచ్చు జూదగాండ్రు తలఁచుచుందురు. ఈ యింటి చుట్టును పుష్పఫలభరితవిచిత్రవృక్షలతాగుల్మ

రమణీయ మైన యుద్యానవన మొకటి శోభిల్లుచుండెను. దీనియం దచ్చ టచ్చట లతానికుంజములలో రమణీయ శిలాదారుమయశయనా సనము లేర్పఱుపఁబడి యుండెను. ఈలతాగృహములలో నొకదాని సమీపమున నొక సాయంకాలమున మాధవుఁ డను సత్తము ద్యాత కరుఁ డొకఁడు కాలక్షేపముకొఱకు విహరించుచుండెను. ఉడుపులను బట్టి యతఁడు కోటీశ్వరుఁ డని తెలియఁ దగి యుండెను. ముఖభావ ము మాత్ర మతని మనోవేదనను వెల్లడించుచుండెను. ఇట్లుండ, నచ్చ టికి సుందరాకారుఁడు, తరుణుఁడు, నాజానుబాహుఁడు నగు పరంతపుఁ డను మహనీయుఁ డొకఁడు వచ్చెను. అతనియందు సత్యధర్మాదిసూ గుణములు మూర్తీభవించిన ట్లుండెను. అతఁ డాయుద్యానసౌందర్య మును జూచుచు నానికుంజము సమీపమునకే తెంచెను. మాధవుఁ డితని సౌందర్య గాంభీర్యముల నవలోకించి యాశ్చర్య మొంది, యీతని గుణాతిశయములు రూపయౌవనముల కనురూపముగ నుండక పోవని మనస్సున నిశ్చయించుకొని, యల్లనఁబరంతపుని సమీపించి "మీ రెవరు? మిమ్ముఁజూచినంత నాకు మీయెడ ననిర్వచనీయము లగు విశ్వాస సంతోషములు జనించుచున్న" వనెను.

ప—నేను పరదేశస్థుఁడను. దేశాటనార్థము వచ్చు చుండఁగా నీయుద్యానరామణీయకము నన్నిచ్చటి కాకర్షించినది. అపరిచితులైన మీయొక్క ప్రియోక్తులకు నేను మిక్కిలి కృతజ్ఞుఁడను. నాపూర్వ చరిత్రమువలన మీ కంతగా ప్రయోజన ముండదు.

మా—లోకమునందలి యేకార్యమును గాని, యేపదార్థమును గాని నిష్ప్రయోజన మని చెప్పుటకు వీలులేదు. మీ యాకారమా త్రముననే మీ బుద్ధిచాతుర్యాతిశయము వ్యంజిత మగుచున్నది. కాఁ బట్టి మీ రిచ్చటికి వ్యర్థముగ వచ్చియుందు రని తోఁపదు. మీయాగ మనోద్దేశమును వినుటకు నాహృదయము తత్తఱపడుచున్నది. ఇదే

మన యిరువుర ప్రథమపరిచయ మైనను, నేదో యొక యనిర్వచనీయ మగు సందర్భమువలన నామనస్సు మీమీఁద ప్రేమపూరిత మగుచున్నది. నేను మి మ్మిదివఱలోఁ జూచినట్లు తోఁచుట లేదు. అయినను, నిప్పుడు మీమీఁద నాకస్మికముగఁ గలిగిన స్నేహాతిశయమును బరిశీలించినచో, మనకిద్దఱకు నేదో యొక సంబంధ ముండితీఱు ననునూహ కలుగుచున్నది. కాఁబట్టి నాకు మీయందు జనించిన విశ్వాసమునకు కారణమును గ్రహించుటకు నేను మీపూర్వోత్తరములను తెలుప గోరుచున్నాను.

ప—అట్లయిన, నావృత్తాంతమును దెలుపుటకుముందు మీయుదంతమును దెలిసికొన వలెననెడియభిలాష నాకుఁ బొడముచున్నది.

మా—నేను కళ్యాణపుర నివాసిని. నాతండ్రి పేరు మహేంద్రపాలుఁడు. నా సహోదరులలో నొకఁడు మృతినొందెను. అతనికి శంబరుఁడను పుత్రుఁడున్నవాఁడు. సుమిత్రుఁడు నాజ్యేష్ఠ సోదరుఁడు, నేనే కనిష్ఠుఁడను. రత్నాకర మను ప్రదేశము నాయధీనములో నున్నది. అకాలమరణముఁ బొందిన నా సహోదరి కొక పుత్రిక కలదు. ఆమె పేరు కళావతి మఱియు సుమిత్రుఁ డొక యనాధబాలికను బోషించుచున్నవాఁడు, వీరిరువురు నక్కసెలియుండ్రవలె నడచుకొనుచుందురు.

ప—(ఆశ్చర్యముతో) అహాహా! అట్లయిన మీ విశ్వాసమునకు సంపూర్ణహేతు వున్నది. నేను మీమిత్రుఁడగు వైరిసింహునికుమారుఁడను. ఇప్పుడు మీయందు నాకు పితృభక్తి నాటుకొనియున్నది.

మా—(దుఃఖాశ్రువులువిడిచి) పరంతపా! వైరిసింహుని యకాలమరణ శోకాగ్ని నన్ను విశేషముగ దహించుచున్నను, నిన్నుఁ జూచిన తోడనే గతించిన మిత్రుఁడు తిరిగి లభించినంత సంతోషము నాకుఁ గలిగినది. నీ వతని కుమారుఁడ వని తెలియుమి నీతో నీరీతిగా మాటలాడితిని. నాప్రియమిత్రుఁడగు వైరిసింహుఁడతని బుద్ధిబలము చేతను, దేహశక్తిచేతను నద్భుతకార్యము లొనర్చియుండెను. నిన్ను

జూడఁగా నీవతనిని మఱపురకుఁ దెత్తువని తోఁచుచున్నది. (అనిపలికి, యతనిని గాఢాలింగనము జేసికొని, తన నివాసస్థలమునకుఁ బిలుచుకొనిపోయి, యత్యాదరమున భోజనాదులొసంగి సత్కరించెను.)

ప—ప్రీతిపూర్వకమగు మీయాతిథ్యమునకుఁ బరమసంతుష్టుఁడనైతిని. నేనొక ముఖ్యమైన కార్యముకొఱ కిచ్చటికి వచ్చియున్నాను. దానికిఁ గాలాతిక్రమము గలుగునను భయమున్నందున మీ సెలవు దయచేయ వేఁడెదను. ఆపని ముగిసినపిదప మీదర్శనము చేసెదను.

మా—నేను నీకు గ్రొత్తనని తలఁప వలదు. ఎంత రహస్యమైనను నాతోఁ జెప్పవచ్చును. నాచేత నగునది యేదియైన నుండిన దానిని జేయుటకు సిద్ధుఁడను.

ప—అయ్యా! ప్రస్తుతము నేను చేయవలసినకార్యఁ మతిరహస్యమైనది. దానిని బ్రకటించుట కార్యహానికి హేతువగును. అయినను, మీకు నాయందుండు ప్రణయమును జూడఁగా, మీకుఁ దెలుపుట వలన నే బాధయు నుండదని తోఁచుచున్నది. ఈపట్టణమున రాజశాసనముల నతిక్రమించి దుష్ప్రవర్తనచే సజ్జనులకు ఘోరమగు బాధను గలిగించువా రనేకు లున్నారని రాజకీయోద్యోగులకు దెలియవచ్చినది. వీరినిగ్రహార్థ మీదేశాధిపతి నాకు సర్వాధికారమును బ్రసాదించి నన్నిచ్చటికిఁ బంపియున్నాఁడు. ఈపట్టణములో నుండు ద్యూతశాలాధికారి యొకఁడు తనయధీనమునందుండు కొందఱుజనులతో నతి క్రూరము లగుదుష్కార్యములను జేయించుచున్నట్లు తెలియవచ్చుచున్నది. అతనిని మొట్టమొదట బంధింపవలసియుండును.

మా—ప్రియమిత్రుఁడా! నీ కార్యము నామనస్సంకల్పమున కనుకూలమైనది. ఈకార్యమును సాధించినయెడల దుష్టనిగ్రహార్థము నీతఁడి యనుభవించిన శ్రమము సఫలమగును. అయిన నాద్యూ

తశాలాధికారి దుష్టుఁడు. అనేకుల సొత్తు నపహరించి యున్నవాఁడు. దీనికొఱకు పెక్కు ప్రాణహత్యలను జేసియుండెను. ఇతని దుండగము లను వెలిపెట్టుటకే నేనిచ్చటికి వచ్చియున్నాను. ఈనీచుఁడు నావిత్త మునఁగూడ చాలభాగమును జూదమున నన్ను మోసపుచ్చి గెలిచి యున్నాఁడు. ఈరాత్రి నేనిదివఱలో నోడినధనము నంతటిని గెల్చి, వాని గర్వమును రూపుమాపుదు నని శపథము చేసియున్నాను.

ప—అయ్యా! మాధవా! మీ శపథము సిద్ధించునట్లతనిని గెల్చు నుపాయ మేదైన నున్నదా?

మా—ఈ రేయి యీ కుటిలునితో నా సర్వస్వము నొడ్డి జూద మాడుదును. బహుశః జయలక్ష్మి నాయందుఁ బ్రసన్నురా లగు నని యూహించుచున్నాను.

ప—మాధవా! మీరీవిధముగ నాలోచింపఁగూడదు. అదృష్టము నెప్పటికిని పరీక్షింపరాదు. లక్ష్మి యధికచంచల; ఆమెప్రస న్నత నమ్మరానిది. ఈదిన మాఖలుఁడు గెల్చునెడల మీ రధిక పరి తాపకరమగు స్థితి బొందఁ గలరు. కాఁబట్టి మీప్రతిజ్ఞను విడిచిపెట్టుట యే సర్వవిధముల శ్రేయస్కరము. ఇంతేకాక, నేను వాని నిగ్రహార్థమే వచ్చియుండుటం బట్టి, యీ సమయమున మీరు వానితో జూద మాడి సర్వస్వమును బోఁగొట్టుకొని యగతికు లగుట యనుచితము.

మా—ఈ దిన మపజయము నొందుదు నను భయము లేశము కూడ నాకులేదు. నేను ధర్మద్యూత నిపుణుఁడ నని పేరు పొందిన వాఁడను. నేనిదివఱ కాడిన యాటలోఁ గొంచెము గర్వించియే యో డితిఁగాని కుశలత లేక కాదు. ఈ రేయియో నేను జయమొందుట నిజము. అట్లుకాక, యొకవేళ బరాజితుఁడనై గతిలేనివాఁడ నయిన నదియు నాకిష్టమే. ఎందువలన ననఁగా, నిఁకముందు నాకు జీవించి యుండవలె ననెడి కుతూహలము కొంచెమైనను లేదు. ఈ క్షణమే

యాత్మహత్య చేసికొనుటకు సిద్ధముగ నున్నాను. నాకు దుస్సహమైన యొక మనోవ్యధ కలదు. ఇది తప్పించుకొనుటకు వే ఉపాయము తోఁచనందున మరణమున కెదురు చూచుచున్నాను.

ప—మీ శపథము నాకెక్కువ సంకటమును గలిగించుచున్నది. ఏమైనను, "జీవన్ భద్రాణి పశ్యతి" అనునట్లు ప్రాణరక్షణ చేసికొని యున్నయెడల కాలానుగుణముగా నిహాపరముల నిష్టార్థము లొందవచ్చునని పెద్దలు చెప్పియున్నారు. ఇది మీరుఁ దెలియని యంశము కాదు. మీరు మరణమున కెదురుచూచు నంతటి దుఃఖాతిశయమునకుఁ గారణ మెద్దియో వచింపుఁడు. సాధ్యమైనచో దానికిఁ దగిన ప్రతీకారము నాలోచింతము.

మా—నాదుఃఖము సహింపరానిది. నీవు పరాధీనుఁడవు కావు గనుక నీతోఁ జెప్పుచున్నాను. నా జ్యేష్ఠసోదరుఁడు కామమోహిని యను నొక యనాథబాలికను దెచ్చి పెంచుచున్నాఁడు. ఈమె తన రూపలావణ్యసంపదలచే రతీదేవినిఁ గూడ మించియున్నదని తోఁచుచున్నది. ఈమె బుద్ధిచాతుర్యమును జూచిన, సరస్వతియే యీరూపముతో నవతరించినదని మనస్సున నాటును. విధాత తనకౌశల్యమంతయు వినియోగించి యీ నారీరత్నమును సృజించి యుండిననే తప్ప వేఱువిధముగ నీమె జనించియుండదు. పోషణార్థ మీమెను నా భ్రాత దెచ్చినది మొదలు నాదు ప్రేమ నీనెలఁతయందుఁ గుదిరి యున్నది. దైవకృపవలన నాబాలకు నామీఁద వలపు మొలకెత్తినది. అయినను, మా యిరువుర పరస్పరానురాగము సఫలమగుటకు మునుపే నా చిన్నయన్న కొమారుఁడగు శంబరుని దుర్బోధచే నామెకు నాపైని యనురాగము నశించినది. హస్తగతమైన లలన పరాఙ్ముఖి యైనది. అది మొదలు నాకుఁ బ్రాణైశ్వర్యములమీఁద విరక్తి వృద్ధి కాఁదొడఁగినది. ఇంతియకాక, నాకు వేఱొక ముఖ్యసంకల్పము కలదు. అది

యొద్ది యనఁగా—నామరణానంతర మపరిమిత మగు నాధన మంతయు
నామనోగతభంజకుఁ డైన శంబరునకుఁ జేరును. నాజ్యేష్ఠభ్రాత
యగు సుమిత్రునికిఁ గావలసినంత ద్రవ్యము కలదు. అతఁడు సంతాన
హీనుఁడు గనుక నాద్రవ్యముమీఁద నతని కాస లేదు. నాసంపద నం
తటిని స్వాధీన పఱచి కొనవలెనని శంబరుఁ డొక్కఁడే మిగుల సాహ
సించుచున్నాఁడు. ఈకారణమున నాయాస్తియందలి స్వల్పభాగమైనను
క్రూరాత్ముఁ డగు శంబరునికిఁ జేరకుండఁ జూచుటయే నాముఖ్యాశయ
ము. మఱియు, నాపశ మైయున్న రత్నాకరమను ప్రదేశమున కనక
ఖనులును, హీరాకరములు నున్నవి. ద్రవ్యసంపాదనేచ్ఛ నన్నుఁ
ద్యజించినందున నాగనులను ద్రవ్వించు ప్రయత్నములు సేయనైతిని.
ఆ కామమోహినిపై నాకుఁగల ప్రణయాతిశయమే యిట్టి విధముగ
నైశ్వర్యజీవితములమీఁద నాకు జుగుప్సను గలుగఁ జేసినది. ఈస్థితిలో
నే నెట్లు బ్రదుకఁగలను?

ప—ఆర్యా! మీరు వచించినది సర్వథా యుక్తము కాదు.
మీరు నాకంటె వయోధికులరు; మఱియుఁ బితృసదృశులు. అయినను,
'యుక్తియుక్తం వచో గ్రాహ్యం బాలా దపి శుకా దపి' యను నీతి మీకుఁ
దెలియనిది కాదు. కనుక నేను ధైర్యముతో మీకు విన్నవించుచున్నా
ను. ఒక బాలకొఱకు ధనాధిపైశ్వర్యతుల్య మగు భాగ్యమును, నిహ
పరసాధక మగు కాయమును బోఁగొట్టుకొనుటకు నిశ్చయించుకొనుట
యనుచితము. దయచేసి యీసంకల్పమును వదలుఁడు. ద్రవ్యవంతుల
కసాధ్య మేది? మీరు మోహించియుండు మహిళవంటి యువతులు
లోకమున లేరని భావించుట యజ్ఞానఫలముకాని వేఱు కాదు. ఈచిం
తను విడువుఁడు. సాధ్యమైనచో నాశక్తిచే నామెకు మఱల మీమీఁ
దఁ బ్రణయము పుట్టునట్లు యత్నించెదను. కానియెడల నాయబలకన్న
మిన్నలగు కన్నెలను దెచ్చి చూపెదను. వారిలో మీ కిచ్చవచ్చిన

వారిని వరియించి, సుఖముగ జీవింపవచ్చును. ఇప్పటికైనను మీ వ్యసనము ద్యజింపుఁడు.

మా—మిత్రమా! నీతో సంభాషించిన కొలఁది నీయందు నాకు విస్రంభ మధిక మగుచున్నది. అయినను, నీ ప్రపంచములో నాయనురాగమునకుఁ బూర్ణపాత్రమైనది యాకామమోహిని ఒక్కతయే. ఆమెకు నాపైఁ బ్రేమ గలిగినచో నంతకంటె నధిక మగు నుపకార మెద్దియు నుండదు. ఈమేలు నొనర్చిన యెడల నాభాగ్య మంతయును నీ యధీనముచేసెదను. అది యట్లుండనిమ్ము. సాయంసమయమగుచున్నది. ఈరాత్రి నేను జూద మాడవలె నని సంకల్పించుకొనియుంటిని గదా? దీనియందు గెలుపు పొందుదునని నాకు దృఢమైన నమ్మకము గలదు, అయినను, జయాపజయములను ముందుగ స్థిరపఱుచుట యసాధ్యము. మఱియు, నీద్యూతశాలాధికారి టక్కరియాటలాడుటయం దెక్కుడ నేర్పరి. ఇతని వంచకత్వమును వెలిపుచ్చుటయు నాయభిప్రాయము. ఒకవేళ నితని ధూర్తత్వమును బ్రకటించిన తోడనే మాయిరువురకును గలహము తటస్థింపవచ్చును. ఈపోరునందు నాకుఁగాని యతనికిఁగాని యపాయము గలుగవచ్చును. అట్టి సందర్భమున నీవలన నగు నుపకార మొకటి గలదు.

ప—నావలనఁ గావలసిన కార్యమును శిరసావహించి చేయుటకు సంసిద్ధుఁడను.

మా—ఆకౄరుఁడు తన్నోడించిన వారిని కత్తితోఁ బొడిచి చంపుట కలదఁట! అట్లు వాఁడు నన్ను వధించుటకుఁ బ్రయత్నించి నాకు హానిని గలిగించిన యెడలఁ దత్క్షణమే నీవు నన్ని వాసగృహమునకుఁ జేర్పవలసియుందువు.

ప—అవశ్య మట్లు చేసెద.

మా—బహుశః వాఁడు నన్నుఁజంపలేఁడు. అయినను, నాకుఁ



వైద్యుఁడు మాధవునికిఁ దగు మందుల నిచ్చుట.

ప్రాణహాని కలుగు సందర్భమునందు నీవు చేయవలసిన పనులను వివరించుచున్నాను. నాచేతిపెట్టెలో నాయాస్తి వినియోగమును వివరించు నొక పత్రమును వ్రాసి పెట్టితిని. ఆపత్రమున వ్రాసినప్రకారము కార్యములు జరుపవలెను.

వ—ఆర్య! మీయాజ్ఞ ప్రకారము నడచుట కెట్టి సంశయము లేదు. అయినను, మీరు చేయఁబోవున దతిప్రమాదకరమయిన కార్యము. ఇట్లు సాహసించుట యయుక్తము. ద్యూతసంకల్పమును విడువుఁడని మిమ్ము ప్రార్థించు చున్నాను. జూదమువలన నలయుధిష్ఠిరాదులుగూడ పెక్కుకష్టముల ననుభవించిరి. ఇది మీకుఁ దెలియనిది కాదు. ఇంతవఱకుఁ బోయిన సొమ్ము పోనిండు. దానిని వేఱుదారుల సంపాదింప వచ్చును.

మా—నాసంకల్పము దుర్నివారము. ఒకవేళ సూర్యుఁ డైన తన గతిని మార్పఁ గలుగునేమో కాని, నేను మాత్రము నాసంకల్పమును విడువఁ జాలను. ప్రియమిత్రమా! అనేక జనులను వంచించి చెఱిచిన యీ కూళకృత్రిమములను బయలుపఱిచి, తగిన శిక్ష వేయించినపక్షమున, మనదేశమును నిర్మూలము చేయు నంటు వ్యాధులలో నొకదానిని రూపు మాపిన ట్లగును. కాఁబట్టి యీరాత్రి నేను వీని కైతవమును వెలువఱిచి, వీనిని గృతాంతపురికిఁ బంపు ప్రయత్నమును జేసెదను. అట్లు కానియెడల, నీకార్యమునందు నా ప్రాణమునైనఁ బోఁగొట్టుకొందును. ఇదియే నాప్రతిజ్ఞ. ఒకవేళ నాకామమోహినియే వచ్చి, నన్నుఁ దా వరించెద నని చెప్పియడ్డినను, ప్రతిజ్ఞా పరిపాలన కొఱకై యామె ప్రార్థనను గూడ నిరాకరించెదను. ఈ విషయమునందు నీవు లేశ మైనను వ్యసనపడవలదు. 'జాతస్య మరణం ధ్రువ' మ్మని చెప్పినట్లు పుట్టినవా రందఱును

గిట్టుట తప్పదు. కాఁబట్టి యట్టికార్యముకొఱకు ప్రాణము నర్పించు వాఁడు ధన్యుఁడను ప్రఖ్యాతిఁ బొందఁడా?

ప—పూజ్యుఁడవగు మాధవా! ఇప్పుడిప్పుడే మీసంకల్ప మత్యుత్తమమైనదని నా మనస్సునందు నాటినది. లోకమున దినదినముఁ జాల మంది మరణించుచుందురు. అయినను లోకకంటకుల నివారించుటకై ప్రాణమును దృణప్రాయముగ నర్పించు మీవంటి దృఢసంకల్పులను నేనిదివఱకుఁ జూడలేను. ఈ దుర్మార్గుని సంహరించుటయందు మీకు నేను సహాయుఁడ నగుదును.

మా—ఇప్పుడు నీవు పలికిన పలుకులు నీ ధర్మతత్పరతను దెలుపుచున్నవి. అది యట్లుండ నిమ్ము. ఇదిగో, యీ వజ్రపుటుంగరమును గ్రహింపుము. ఇది మావంశపరంపరగా నుండఁదగిన యభిజ్ఞానవస్తువు. నే నీరాత్రి యీ దుర్మార్గునిచే సంహరింపఁబడిన పక్షమున నీ యంగుళీయకమును నాయన్నకుఁ జూపుము. అప్పు డతనికి నీమీఁద భ్రాతృవాత్సల్యము జనించు ననుటకు సంశయము లేదు. ఇంతేకాక, నీకు వలయు నిష్టార్థము లన్నియు నతఁడు నీ కొసంగును. అయినను ఈ యంగుళీయక మేకారణమునఁగాని నా యెడల జ్ఞాతిమాత్సర్యముగల శంబరుని హస్తగత మైనచో నీవప్పుడు మృత్యువశమగుదువు. కాఁబట్టి యీ విషయమున నీ వధికజాగరూకుఁడవై యుండవలెను. ఈ రాత్రి ద్యూతశాలకు రమ్ము. వచ్చినను నాయాటవిషయములందుఁ గాని నాప్రాణరక్షణమునపట్లఁ గాని లేశమాత్రము చేయి చేసికొనఁ గూడదు. నేను నీకుఁ జెప్పిన కార్యములను మాత్రము జాగ్రత్తతో నడుపుము.

ఇట్లు పలికి, మాధవుఁడు ద్యూతసౌధమునకు వెడలి పోయెను.

## అధ్యాయము 2.

—)o(—

మాధవుఁడు వెడలిపోయిన పిదప పరంతపుని మనస్సునందు క్రిందివిధముగ నొక విచిత్రాలోచన లంకురించినవి.—

మాధవుఁడు పిచ్చివాఁడా? కాఁడు. ముమ్మాటికిని పిచ్చివాఁడు కాఁడని తోఁచుచున్నది. అయినను, దురోదరపరాయణులకు మితిమీఱిన యొకవిధమగు పిచ్చి పట్టుట గలదు. ఇట్టి యున్మాదము కొంచెమైన నితనికిఁ గలిగియుండఁ గూడదా? అట్లు వక్కాణించుటకుఁ గూడ నవకాశము లేదు. ఏల యనఁగా, నితనియైశ్వర్యము పరిమితి లేకయుండుటచే నీచకృత్యములవలన ధనార్జనము చేయునభిలాష యితని కుండదు. మఱియు, నితఁడు ద్యూతాసక్తి కలవాఁడుగ నున్నను కపటద్యూతముచే జనులను జెఱుచువారియెడల నితనికిఁ గల ద్వేషమును జూడఁ బరమాశ్చర్య మగుచున్నది. ఇతనికి ధర్మద్యూత విశారదుఁడను పేరు తగి యున్నది. ఇతఁడధర్మద్యూతాసక్తులను శిక్షించుటకొఱకు తన సర్వస్వమును, తుదకుఁ బ్రాణమును బోఁగొట్టుకొనుటకు సంసిద్ధుఁడై యున్నాఁడు. ఆహా! ఇతఁడు లోకవిలక్షణుఁ డగు మహాశయుఁడు. ఇతని మాటలవలన నా ద్యూతశాలాధికారి కపటద్యూతాసక్తుఁ డనియే కాక ఘాతుకుఁ డనియు మనము గ్రహింపనగును. మఱియు, మాధవుఁ డీరాత్రి ద్యూతమునందుఁ దన కేదైన నపాయము సంభవింపవచ్చునని చెప్పియున్నాఁడు. కాఁబట్టి సమస్త ప్రయత్నములచేతను విపత్తునుండి మాధవుని దప్పించుటయే కాక, ఘాతుకుఁ డగు నధికారి గర్వము నణఁచి, వానిని యమాలయమునకు బంపవలసియున్నది. దీనికిఁ దగిన కృషిని జేసెదను.

పరంతపుఁడు పైని వివరించినట్లు మనస్సులో నిశ్చయించుకొని,

సమీపమున నున్న పూఁటకూళ్ళయింటిలో భుజించి, జూదపుటింటిలోఁ బ్రవేశించెను. అచ్చట ద్యూతశాలాధికారితో జూదమాడుటకు మాధవుఁడు వచ్చియుండెను. ఆట చూచుటకు వచ్చిన ప్రేక్షకులు కొందఱు పార్శ్వముల నాసీనులై యుండిరి. తత్క్షణ మాట ప్రారంభమయ్యెను. పరంతపుఁడు బారుచేసిన యొక ఁరివాల్వరు నీను సిద్ధపఱుచుకొని జూదమాడువా రిద్దఱిసంభాషణమును వినఁగలిగినంత దూరమున నొకవైపునఁ గూర్చుండెను. ఆరాత్రి ద్యూతమునందు మాధవుఁడు తనవిరోధి మోసమునకు లోనుగాక ప్రతియాటయందును జూపరుల యామోదమును బొందుచుండెను. ఇతని కౌశల్యమువలననో లేక దైవకృపవలననో జయలక్ష్మి మాధవుని వరించినది. అనేక జనులను వంచనచేసి యధర్మముగా గెలుపొందిన ద్రవ్యములో నర్ధభాగము మాధవునివశ మయ్యెను. తత్క్షణమే ద్యూతశాలాధికారికి సంతాపము, మాధవుని మీఁదఁ గోపము హెచ్చయ్యెను.

ద్యూ—(మాధవునిఁ జూచి) అయ్యా! ఈరోజు జయలక్ష్మి నీయధీనములో నున్నది. అయినను, చింతలేదు. ఇప్పుడు నాయాస్తి సగముపాలు నీకుఁ జేరినది. ఇఁకముందు నాడవలసిన పక్షమున నోడిపోవువారు గెల్చువారికిఁ దమసర్వస్వము నొప్పగింపవలెను. ఈ నిర్ణయము నంగీకరించినయెడల నింకను నాడుదము; అట్లు కానిపక్షమున, మనజూదము నింతతోఁ జాలింతము.

మా—(కొంచె మాలోచించి)నీవు చెప్పునది నా కంగీకారమే. జూదమునందుఁ బ్రవేశించినవారు పూర్తిగఁ జెడిపోవలెను; లేనియెడల దానివలన బాగుగ జీవింపవలెను. ఇప్పుడు నాధనము నీద్రవ్యముకంటె నూఱురెట్లధికముగ నున్నది. అయినను, బాధలేదు. నీవు జయమును బొందినయెడలఁ బ్రస్తుతము నీయొద్దనుండి నేను గెల్చియుండిన సొమ్ముతో నాసర్వస్వమును నీ స్వాధీనము చేసి, నేను దేశభ్రష్టుఁడ నై

పోయెదను; నేను గెల్చినచో, మిగిలియుండు నీయాస్తియంతయు నావశము కానిమ్ము.

ఇందుల కిరువురును సమ్మతించిరి. అచ్చట నున్నవారి యనుమతిని బొంది యాప్రకార మొక నిర్ణయపత్రికను వ్రాసిరి. అచ్చటివారందఱు దానిమీఁద స్వహస్తచిహ్నములను గుర్తించిరి. తోడనే యాట తిరిగి ప్రారంభ మయ్యెను. ఆయాటలోఁ గూడ భగవన్నియమమువలన మాధవునికే జయము చేకూరెను. అప్పు డాశాలాధికారి యనంత సంతాపాక్రాంతుఁడై కొన్ని నిమేషములవఱకు స్తబ్ధుఁడుగ నుండి, కొంచెము సేపటికి తెలివి తెచ్చుకొని మాధవునితో, 'ఒరే దురాత్మా! మాధవా! నీవు చాల మాయావివి; నేనో యనేకలక్షల జనులతో జూద మాడినవాఁడను; అయినను నింతవఱకు నేరిచేతను బరాజయము పొందిన వాఁడను గాను. నీ వేదో యొకవిధమగు చమత్కారముతో నన్ను మోసపుచ్చి, యధర్మద్యూతముచే నీరీతిని నన్ను గెలిచినట్లు సంశయము పొడమినది. కాఁబట్టి, యీ యాట నాకు బొత్తిగ సరిపడలేదు. నీవు గెల్చినదానిలో దేనిని గాని నీకు నే నియ్యను.' అని చెప్పెను.

మా.—ఓరీ నీచుఁడా! నీపేరున కనురూప మగు మాటల నాడితివి. నేను వంచకుఁడ ననియు, నధర్మముగ నాడువాఁడ ననియు నిర్ణయించుటకు నీ సభికులు సాక్షిభూతులుగ నున్నవారు కదా! నీవు వ్రాసియిచ్చిన యొడంబడికయే ముఖ్యమైనసాక్షి. అధర్మద్యూతముచేఁ బెక్కుజనులను వంచించి సంపాదించిన ద్రవ్యము నీ కెన్నిదినములు సహకారిగ నుండును? 'అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫలమశ్నుతే' యను నట్లు నీ వొనరించిన యతి క్రూర పాపకార్యముల కిప్పుడే తగిన ఫలము ననుభవింప వలసియుండును. కాఁబట్టి, యింక ము దిట్టి కపటకృత్యములకు విడువుము. ఇట్టి లోకాపవాదముతో

జీవించుటకంటె మరణమే యుత్కృష్ట మని పెద్దలు చెప్పుదురు. అందుచేఁ బూర్వాపరములను యోజించి వివేకముగలిగిప్రవర్తింపుము. ఈ మాటలను వినిన తోడనే యా యధికారి యధికక్రోధపరవశుఁడై తాను దాఁచియుంచిన కరవాలమును దీసి, 'ఓరీ మాధవుఁడా! చాలును. నీనీతిబోధ నింతతో నిలుపుము. నీయాయు స్సీదినముతో ముగిసినది' అని వచించి, యతనిమీఁదఁ గరవాలమును బ్రయోగించెను. వెంటనే మాధవుఁడు మూర్ఛితుఁడై నేలమీఁదఁ బడెను. అచ్చటఁ గూడిన జను లందఱు భయముతో నిటునటు చూచుచుండులోపల, నొకధ్వని వినఁబడి యాశాలాధికారి చిల్లులుపడిన గాత్రముతో క్రిందఁ బడెను. అంతలో నక్కడ కోలాహలము బల మయ్యెను. జను లనేకులు వచ్చి చేరిరి. ద్వ్యాతశాలాధికారి కిట్టి యపాయ మెవరివలన సంభవించిన దని యెచ్చటఁ జూచిన నేమియుఁ దెలియదయ్యెను. ఇంతలో జింతాక్రాంతులై యున్న యతని సంబంధు లతని శరీరమును లోనికి మోసికొని పోయిరి.

---

## అ ధ్యా య ము. 3.

——)o(——

అచ్చట నుండిన జనులందఱు మాధవునికి సంభవించిన విపత్తునుగుఱించి దుఃఖించు చుండునంతలో పరంతపుఁడు మాధవుని సమీపించి, శైత్యోపచారములను జేయఁగా మాధవునికిఁ గొంచెము చైతన్యము కలిగెను. అప్పుడు పరంతపుఁడు మాధవునికిఁ దలిగిన దెబ్బను బరీక్షించి, కొంచెము వివర్ణముఖుఁడై చింతించుచుండెను.

మా—పరంతపా! సంతాపపడకుము. నాకీయవస్థ రావచ్చునని నేను మొట్టమొదటనే తెలిపియుంటినే కదా! నాకుఁ బ్రాణోత్క్రమణకాలము సన్నిహిత మైనది. దానికి మునుపే నేను చేయవలసిన

పను లనేకములున్నవి. కాఁబట్టి, యీక్షణముననే భోజనగృహములోని నాగదికి నన్నుఁ దీసికొనిపొమ్ము.

వెంటనే పరంతపుఁడు మాధవునిఁ బల్లకిలోఁ బరుండఁబెట్టి, యతఁడు నిర్దేశించినస్థానమునకుఁ గొనిపోయి, పర్యంకముమీఁద శయనింపఁ జేసెను.

మా—పరంతపుఁడా! ఆపత్కాలమున కుపకరించువాఁడేబంధువు. అతఁడేపుత్రుఁడు. ఆకారణముచేఁ బ్రకృతమునందు నీవేనాకుఁ బరమాప్తుఁడవు. ఇప్పుడు విశేషముగ మాటలాడుటకు నాకు శక్తిలేదు. అది యటుండనిమ్ము. నన్నుఁ గొట్టిన పిదప నాపగవాఁ డేమయ్యెను?

ప—అతనిప్రహారముచే మీరు మూర్ఛితులై నేలమీఁదఁ బడులోపలనే యతనిశరీరము సహస్రరంధ్రములు గలదై యతనికి దీర్ఘనిద్ర సంప్రాప్తమయ్యెను. ఇప్పు డతఁడు తన దుష్కృత్యములకు నర్హమైన శిక్ష నంతకపురిలో ననుభవించుచున్నాడు.

మా—ఇట్లు జరుగవచ్చు నని నేను ప్రథమముననే భావించి యుంటిని. నా సంకల్పము దైవసాహాయ్యముచే నెఱవేఱినది. అతనిదుష్కార్యములకీ శిక్షకూడ నత్యల్పమైనది. ఇది పోనిమ్ము. నా కొఱకు వైద్యునిఁ బిలిపింపుము.

ప—చిత్తము. అని వెలుపలకుఁ బోయి, పూర్వమునందే తానేర్పాటు చేసి యుంచిన జీవానందుఁ డను వైద్యునితో వచ్చి, యచ్చట నున్నవారి నందఱను బయటికిఁ బంపెను.

మా—(వైద్యునితో) అయ్యా! రోగహారీ! నాకుఁదగిలిన దెబ్బను జాగరూకతతో శోధించి నే నిఁక నెన్నినిమిషములవఱకు జీవింపఁ గలనో తెలుపుము.

జీ—(అతనిని బరీక్షించి చూచి) ఆర్యా! మాధవా! మీకు సంభవించిన విపత్తు అధికప్రమాదకర మైనది.

మా—ఇది నాకు ప్రథమముననే తెలియును. పుట్టినవా రెప్పు డో యొకప్పుడు గిట్టుదురు. మృతినొందుదునను వ్యసనము లేశమాత్ర మునాకు లేదు. అయినను, నాయాస్తి యపరిమితముగ నుండుటం బట్టి నేను మరణించులోపల దానివినియోగపు టేర్పాటులను జేయ వలెననెడి యభిలాష నాకు మెండుగ నున్నది. ఇంకను నెంతకాలము బ్రిదుకుదునో ధైర్యముతోఁ జెప్పుము.

జీ—మాధవా! మీయవస్థను జూడఁగా నొకయరగంటలోపల మీాయువు రుత్క్రమించి పోవునని తోఁచుచున్నది. అయినను, నాచి కిత్సాశక్తివలన నింకను నారుగంటల కాలము మిమ్ము బ్రతికింపవచ్చు నని నేను నమ్ముచున్నాను.

మా—అంతమాత్రమయినఁ జాలును. అప్పటిలో నాద్రవ్యము నంతటిని వినియోగ పఱుపవచ్చును. (పరంతపునిఁజూచి) ప్రియమిత్రుఁ డవగు పరంతపుఁడా! నాజేబులోఁ గొన్ని కరెన్సీనోట్లును, నమూల్య మైన రత్నహార మొకటియు నున్నవి. వానినిఁ దీసి యతని కిమ్ము. ఇతం డిచ్చటనే యుండి నాధన మంతయు వినియోగింపఁబడుదాఁక నా ప్రాణము నాసంహానమును విడువకుండునట్లు రుక్ప్రతి క్రియలను జేయు చు నుండనిమ్ము.

పరంతపుఁడా నోట్లను, మండనమును జీవానందుని కొసఁగెను. అతఁ డత్యంత సంతుష్టుఁడై మాధవునికి శ్రమము లేకుండునట్లు తగిన భేషజముల నుపయోగించుచు, నతని ప్రతిజ్ఞకుఁగాని జీవనమునకుఁగాని యాటంకము రాకుండ చికిత్స చేయుచుండెను.

మా—పరంతపా! ప్రక్కగదిలో నర్థపరుఁడను న్యాయవాది యున్నాఁడు. అతనినిఁ బిలుచుకొనిరమ్ము.

ఈలాగు పలుకునంతలో నర్థపరుఁడు సమీాపించి, "అయ్యా!

మీారిప్పు డనుభవించుచున్న యవస్థను బరిశీలించి నేను మిగుల భయా క్రాంతుఁడనై యున్నాను" అనెను.

మా—మీా యాగమనము నా కనంతసంతోషమును గలిగించినది. జగత్తునందు బాధలకు గురి కానివా రెవ రుందురు? నాకై చింతింపవలదు. ప్రస్తుతము మీావలన నా కొక కార్యము గావలసియున్న కారణమున దానిని న్యాయ శాస్త్రానుసారముగ నడపింపుఁడు. అందుకుఁ దగిన ధనలాభమును మీారు పొందుదురు. (పరంతపునితో) పంతపా! ఇచ్చట నుండువా రందఱను పిలుచుకొని వెలుపలికిఁ బొమ్ము. అర్థపరునితోఁ గొంచెము సేపు సంభాషించినపిదప నిన్నుఁ బిలిచెదను.

ప—చిత్తము (అని వెలుపలికిఁ బోవును.)

మా—అర్థపరుఁడా! నాయాస్తి వినియోగము విషయమున నొక పత్రము నిప్పుడు వ్రాయవలెను. పత్రమునం దేవిధమైనలోపము లేకుండఁ జూడుము. నేను మీాకు ఇన్నూఱు రూపాయల నిచ్చెదను.

అ—(సంతోషముతో) ఆర్యా! తక్కిన చోట్ల దొరకు ధనముకంటె ద్విగుణముగ నిచ్చునపుడు మీావిషయమునం దెవరు శ్రద్ధతోఁ గార్యములను జేయకుందురు?

అట్లు పలికి, యర్థపరుఁడు మాధవుని యాస్తి వినియోగవిధమును దెలిసికొని యొక పత్రమునువ్రాసి, మాధవుని కొప్పగించి, యతఁ డిచ్చిన రెండువందల రూపాయలను దీసికొని వెడలిపోయెను.

పిదప మాధవుఁడు పరంతపునిఁ బిలిచి యతనిచే రెండు జాబులను వ్రాయించి, వానిలోఁ దనదస్కతు వేసి, యిట్లనెను: ఇఁక స్వల్ప కాలములోనే నేను స్వర్గస్థుఁడ నగుదును. నాసొత్తు వినియోగపడవలసిన విధ మీాపత్రమునందు వ్రాయఁబడి యున్నది. దీనిని నీవు భద్రపఱిచి, రిజిష్టరు చేయింపవలెను. నాశవమును కల్యాణనగరమునకుఁ గొనిపొమ్ము. అచ్చటనున్న నాయన్నయగు సుమిత్రుని కీవజ్రపుటుంగరమును జూపఁగానే యతఁడు నిన్ను సోదరునివలెఁ బ్రేమించును. నా

వృత్తాంతము సంతను నతనికి వినిపించి, నాయుత్తరక్రియ లన్నియు సాంగముగ జరుగునట్లు చూడుము. ఈరెండు కాగితముల నతని కిమ్ము. వీనిలో నొకటి నాయాస్తియొక్క వినియోగమును గుఱించినది. రెండవది నే నతనికి వ్రాసిన యుత్తరము. వీని నతనికి రహస్యముగ నిమ్ము. నాచేతి పెట్టెలో నుండుసొమ్మునుండి నీప్రయాణమునకును, నాదేహ సంస్కారమునకును నేనూఱురూపాయల నుపయోగపఱచి, మిగిలినద్రవ్యములో నయిదువేలరూపాయలను నాప్రేయసియగు కామమోహిని కిమ్ము. మిగత సొత్తును నీయుపయోగమునకు వాడుకొనుము. మఱియు నావశమైన ద్యూతశాలాధికారి యాస్తి రెండులక్షల రూపాయ లుండవచ్చును. జూదపు టేర్పాటు ప్రకార మతని సొమ్మంతయు నాస్వాధీనమగును. దానిని మూలధనముగ రాజ్యాధికారుల వశము చేసి, దానివడ్డిని ద్యూతవ్యభిచారాది దుష్కృత్యములచే లోకకంటకులైన వారిని నిగ్రహించుట కుపయోగించునట్లు చేయింపవలెను. ఇంతేకాక, మాయింటిలోని యినుపపెట్టెలో నొక లక్షద్రవ్య మున్నది. ఇంకను కావలసినంత భూస్థితియుఁ గలదు. నాకుఁ జేరిన రత్నాకరమునందు బంగారు గనులును, రత్నపుగనులును గలవు. వానిని ద్రవ్వించి సువర్ణ రత్నోద్ధరణప్రయత్నములను జేయుము. అట్లు చేసినపక్షమున నీ వల కాపతివంటి యైశ్వర్యవంతుఁడవగుదువు. పైనిఁ జెప్పిన ద్రవ్యముల నన్నిటిని నీకిచ్చినట్లు నామరణశాసనమున వ్రాసియున్నాను. నీ వీద్రవ్యములను స్వాధీనపఱచుకొని, ప్రాథమికపాఠశాలాస్థాపనకును, గ్రామపుస్తకభాండాగారస్థాపనకును, గ్రామస్థుల జ్ఞానము నభివృద్ధిచేయు భజనలు, ప్రసంగములు, నాటకములు, పురాణశ్రవణములు, వార్తాపత్రికలు మొదలగువాని నేర్పాటుచేసి గ్రామోద్ధరణముచేయుటకును, విద్వజ్జనుల యొక్కయు, అంగవిహీనులయొక్కయుఁ బోషణకును, దిక్కులేనిబిడ్డల రక్షణకును వినియోగింపుము. శంబరుఁడు తన భాగము సంతను

దుర్వ్యయముచేఁ బోఁగొట్టుకొని, నాసర్వస్వమున కిప్పుడు తానే హక్కుదారుఁడ ననుచున్నాఁడు. నాయాస్తి యంతటిని నీకు నేనువ్రాసి యిచ్చినందున నతనికి నీమీఁద నధికద్వేషము జనించును. కాఁబట్టి నీవు జాగరూకుఁడవై యుండవలెను. ఇది కాక, యింకొక రహస్య విషయమును నీతో నేను చెప్పవలసి యున్నది. కామమోహిని యధిక సౌందర్యవతియు, సుగుణవతియునై యుండుటవలన సమస్తవిషయము లందును నామె నీకనురూపవతిగ నుండును. శంబరుఁడామెను బలాత్కారముగా వివాహముచేసికొనుటకధికప్రయత్నము చేయుచున్నాఁడు. దైవగతి యేవిధముగ నుండునో తెలియదు. నీవు నేను చెప్పిన కార్యములలో దేనిని గాని మరవక, వాని నన్నిటిని నెఱవేర్చి, నన్ను కృతకృత్యునిఁ జేయుము. ఇట్లు పలికి, మాధవుఁడు తన పెట్టెల తాళపుచెవుల నతని కిచ్చి, పరంతపునితో వైద్యునిఁ బిలువు మనెను.

పరంతపుఁడు వైద్యునితోఁ బ్రవేశింపఁగా, మాధవుఁడు జీవానందునిఁజూచి 'ఆయుర్వేద, చికిత్సకుఁడా! నేను మయిమఱచి కొంతకాలము సుఖనిద్రనుబొందుటకు నేదైన నొకయౌషధము నిమ్ము. నా శరీరబాధ యధికముగ నున్నది' యనెను. జీవానందుని భేషజమును సేవింపఁగానే, యతనికి గాఢనిద్ర పట్టెను. వైద్యుఁ డతనిసమీపమునఁ గూర్చుండెను. పరంతపుఁడు తనసేవకుఁడగు మంజీరకునికొఱకు వెలుపలికివచ్చి చూచి, యతఁడు కనఁబడనందున వీథిలోని వారినడుగఁగా, వారిలోనొకఁడు మంజీరకుఁడు తనహస్తమున నొక చిన్నతుపాకితోఁ బోవుచుండఁగా, పోలీసువా రతనినిఁ జూచి, యతఁడే ద్యూతశాలాధికారిమరణకారకుఁ డని నిశ్చయించి, నగరాధ్యక్షుని యొద్ద కతనినిఁ బిలుచుకొనిపోయిరి' అని చెప్పెను. అప్పుడు పరంతపుఁడు వ్యాకులచిత్తుఁడై, మాధవుఁడు నిద్రించు స్థలమునకు వచ్చి, యతని దేహస్థితినిఁ గూర్చి వైద్యునడిగి, యింకను మూఁడు నాలుగు గంటల

వలన ప్రాణభయము లేదని తెలిసికొని యచ్చటనుండి యానగర కారాగృహమును జేరెను. దానికవాటము బంధింపఁబడి యుండెను. ద్వారపాలకుఁడు ద్వారముదగ్గఱ నిలుచుండెను. వాఁడు పరంతపుని జూచుటతోడనే 'ఎవరు నీవు? ఈ సమయమున నిచ్చటికి వచ్చుటకుఁ గారణమేమి? మరలి పొమ్ము. లేనియెడల నిప్పు గుండుతోఁ గాల్చి వేయుదును' అనెను.

అప్పుడు పరంతపుఁడు, 'అయ్యా, నేను పరదేశిని. దారి తెలియక యిచ్చటకు వచ్చితిని. క్షమింపుము' అని జవాబు చెప్పి, వేఱు మార్గమున వాని వెనుకవైపునకు వచ్చి, తటాలున వానిమీఁదఁబడి, వానిచేతిలో నుండిన నళికమును లాగుకొని, వానిని నేలకుఁద్రోసి, నోటిలో బట్టను దుఱిగి, వానికాలుసేతులను దృఢముగా బంధించెను. పిదప వానిని బరిశోధింపఁగా వానిజేబులో నొకతాళపుచెవి దొరకెను. దానితో నతఁడు బందీగృహకవాటమును తెఱచి, "మంజీరకా! ఎచ్చట నున్నావు?" అని ఎట్టిగా నఱచెను. అప్పుడంతర్భాగమునుండి "స్వామీ! యిచ్చటనున్నా" నను ధ్వని శ్రుతమయ్యెను. లోపలి గదిబిలుకును పరంతపుఁడు తెఱవఁగా, మంజీరకుఁ డధిక విస్మితుఁడై బయటికి వచ్చెను. పరంతపుఁడు వాని నత్యానందముతో నాలింగనము చేసికొని, మొదట నుండినట్లు ద్వారమును మూసి దానితాళపుఁ జెవిని కావలివాని జేబులో నుంచి, తనయొద్ద నున్న పదిరూపాయలను వానివస్త్రములోఁగట్టి, క్షమింపుమని యతనిని కోరి, యధికారు లతనిని శిక్షింపకుండునట్లు వానికాలుసేతులను బిగుతుగ బిగించి కట్టి మంజీరకునితో మాధవుఁడుండిన స్థలమునకే తెచ్చి, మాఱువేషము మంజీరకునికివేసి 'నీవు కళ్యాణపురమునకు వెడలి, యచ్చట నుండుము. నేను వెంటనే వచ్చెదను.' అని పలికి, యతనిని బంపివేసి మాధవుని జేరెను. మాధవుఁ డప్పుడు మేల్కొని పరంతపుని

తన యుపకంఠమున నుండ నియమించి, జీవానందునితో 'మిత్రుఁడా! నీవు చేసిన పరమోపకారమునకు నేను మిగులఁ గృతజ్ఞుఁడను' అని చెప్పి, తనయొద్దనుండిన రత్నమౌక్తికసరము నొక దానిని వైద్యుని హస్తమునఁ బెట్టి, దానిని విక్రయింపఁగా వచ్చు ద్రవ్యమును రాజ్యాధికారుల కొప్పగించి, కొంతధనమును విశాలమై నట్టియు, ననుకూల మైనట్టియు, నొక వైద్యశాలను నిర్మించుటకును, మిగత ద్రవ్యమును మూలధనముగ నుంచుకొని, దానివడ్డీని వైద్యశాలాభివృద్ధికిని, రుగ్ణులు మొదలగువారి యన్నపానములకును నావశ్యకములగు భేషజములకొఱకును వినియోగించునట్లును నిర్మింపవలెను. ధనదాతలకు మీ రేరీతిని రోగనివారణచేయుదురో యావిధముననే యావైద్యశాలలోఁ బ్రవేశించు రోగులకుఁ ధర్మార్థముగ వ్యాధి ప్రతిక్రియ జరుపఁబడవలె నని నాప్రార్థన. ఈధర్మ మాచంద్రార్కముగ సాగునట్లు మీరును, పరంతపుఁడును పర్యాలోచనము చేసి, మీయిరువురకును సమ్మతి యగుపద్ధతి నవలంబింపవలెను. ఈ సరము నిప్పుడే రాజ్యాధికారుల కొప్పగించి, నామనోరథమును సఫలము గావింతుమని బాసచేసినయెడల, నేను మహామోదముతో నసువులను విడుతును.

ప—మీ యభీష్టము నెఱవేఱునని యిప్పుడే ప్రతిజ్ఞ చేయుచున్నాను. జీవానందా! నే నయిదునిమిషముల లోపున నీనగరన్యాయాధ్యక్షునిఁ బిలుచుకొని వచ్చెదను. ఈమహాధర్మమును మాధవుఁడు తనచేతితోనే చేయుఁగాక!

జీ—కానిమ్ము.

పరంతపుఁడు వెంటనే న్యాయాధ్యక్షునియొద్దకు వెళ్ళి, యీవిషయముల నతనికి సంక్షేపముగఁ దెలిపి యతనినిఁబిలుచుకొనివచ్చెను. అప్పటికి సూర్యోదయ మయ్యెను. మాధవుఁడు లేచుటకుఁ బ్రయత్నించుచుఁ జేతఁగాక యుండుట చూచి, పరంతపుఁ డతనిని లేవనెత్తి కూర్చుండఁ

బెట్టెను. అప్పుడు మాధవుఁడు న్యాయాధ్యక్షునిఁ జూచి, ఆర్యా! మీరు సమయమున దొరకుట నాపురాకృతసుకృతాతిశయమనితోఁచుచున్నది. ఈ వెలలేని సరమును గ్రహింపుఁడు. పరంతపజీవానందులు నాకు పరమాప్తులు. మీరు వీరిరువురితోఁ జేరి వైద్యశాలాస్థాపనసంబంధ మగు ధర్మకార్యమును నెఱవేర్చినచో, దీనిసుకృతములోమీరును భాగస్థు లగుదురు. నాయభ్యర్థనకు మీయంగీకారము నిచ్చినచో నేను సంతుష్టుఁడనై ప్రాణమును విడుతును.

న్యా—ఇట్టి ధర్మాత్ముల నీవఱ కెప్పుడునుజూడనైతిని. మీరు ధన్యులరు. అపరిమిత ద్రవ్యార్జనచేసి, తా మనుభవింపకయు, సత్పాత్ర వినియోగము చేయకయు, ధనపిశాచములవలె బ్రదికి, తుదకు చోరులు మొదలగు నపాత్రులకు తమ సర్వస్వమును పాల్పఱచిన యనేక మూఢులను నేను కనుఁగొంటిని. సంపాదించిన ధనమునకు దానభోగములను రెండు పథములు సార్థకతను గూర్చును. ఈరెండును పుణ్యవంతులకుఁ గాక, యితరులకు లభింపవు. ఈ దినము మీరు మీ ధనమును వినియోగింపఁ దలఁచిన రీతియే మీపుణ్యాతిశయమును విస్పష్టము చేయుచున్నది. ఇట్టి విషయమున మీ కెవరు తోడ్పడకుందురు? (పరంతపునిఁజూచి) అదిగో! యీమార్గమున నీదేశపు కోశాధ్యక్షుఁడు, మ్రొక్కఁబోయిన దేవుఁడే యెదురైనట్లు, వచ్చుచున్నాఁడు. పారమార్థికమనోరథపూర్తికి వలసిన సాధనము లన్నియు నప్రార్థితముగ సమకూడుట సహజమైన విషయమే. మీరు వేవేగ వెడలి వారినిఁ బిలుచుకొనిరండు.

పరంతపుఁ డతనినిఁ బిలుచుకొనివచ్చెను. అప్పు డాకోశాధ్యక్షుఁడు న్యాయాధ్యక్షునితో ‘ఆర్యా! నేను మిమ్ములనే వెదకుచున్నాను. మన పట్టణమందలి ద్యూతశాలాధికారి ద్యూతకలహపరవశుఁడై, యతని సర్వస్వమును గెల్చినమాధవుని ఖడ్గముతోఁ బొడిచి చంపె

ననియు, వెంటనే మాధవుని ప్రక్కనుండిన మనుష్యుఁ డొకఁడు తుపాకినిఁ బేల్చి, యతనిని బరలోకగతునిగఁ జేసెననియు, ద్యూత శాలాధికారి సంహారకుఁడను సంశయమున నొకనిని రాజకీయోద్యోగులు పట్టుకొని, కారాగృహమున నుంచిరనియు, వాని మిత్రుఁ డొకఁడు కారాగృహద్వారపాలకుని మోది, వానిని విముక్తునిగఁ జేసెననియుఁ దెలిపి, దాని నిజము కనుఁగొనుటకు రాజకీయోద్యోగులు ద్యూతశాలకు దండాధ్యక్షునితోఁ బోయి, యచ్చటి జనుల వశమం దుండిన ద్యూతపు టోడంబడిక పత్రమును గ్రహించి, ద్యూతసమయమున నచ్చటనుండిన జనుల వాఙ్మూలములను వ్రాసికొని, సంహరింపఁబడిన వానియాస్తిని రక్షించు నేర్పాటులఁజేసి, మిమ్ములను వెదకుచున్నారు.

న్యా—అయ్యా! పరంతపుఁడా! వారి నిచ్చటికే పిలుచుకొని రమ్ము.

పరంతపుఁడు వెడలినవెంటనే న్యాయాధ్యక్షుఁడు కోశాధికారితో, "అయ్యా! ఇతఁడే మాధవుఁడు. ఇతఁడు ద్యూతశాలలో ప్రహారముచే మూర్ఛితుఁడు కాఁగానే, యీవైద్యుఁడును, మిమ్ములను బిలుచుకొనివచ్చిన పరంతపుఁడును, మాధవు నిచ్చటికి మోసికొని వచ్చి, యుపచారములను జేయుచున్నారు. ఈభిషగ్వరుఁడు సమస్తప్రయత్నములచేఁ జికిత్సలను జేయుచు నింతవఱకు మాధవునికిఁ బ్రాణాపాయము రాకుండఁ జేసి యున్నాఁడు. ఇతని యుత్క్రమణకాలము సమీపించుచున్నది. ఇతఁడు చాల విలువగల రత్నమౌక్తికసరమును ధర్మవైద్యశాలా స్థాపనమున కిచ్చియున్నాఁడు. ఈధర్మము చిరస్థాయిగనడచుటకు దీనిని రాజ్యాధికారుల కొప్పగించి, దానిని లోపములేక నడపించు ప్రయత్నమును జేయుటకు నన్నిచ్చటకుఁ బిలిపించియున్నాఁడు. మీరును కూడ దీనికి సహాయులై యుండవలెనని ప్రార్థించుచున్నాఁడ,

కో—ఇట్టి ధర్మకార్యములందుఁ దోడ్పడు సందర్భము దొరకుటయే మన పుణ్యప్రభావమును జూపుచున్నది. నావలనఁ గావలసిన కార్య మేదియున్నను దానిని దప్పక చేసెదను.

ఇంతలో పరంతపుఁడు రాజకీయోద్యోగులతోను, దండాధ్యక్షునితోను నచ్చటకు వచ్చెను. వారు జరిగినవిషయము లన్నిటిని నామూలాగ్రముగ విని, మాధవుని యౌదార్యమును స్తుతించి, తమచేతనగు సాహాయ్యమును జేయుట కంగీకరించిరి. న్యాయాధ్యక్షుఁ డీధర్మద్రవ్యోపయోగ మగు రీతినిఁ దెలుపు మరణశాసనమును వ్రాయించి దానియందు మాధవుని యనుమతిచిహ్నమును వేయించి, యతఁ డిచ్చిన రత్నసరమును గోశాధ్యక్షునివశము చేసెను.

మా—మహాశయులారా! ఈవఱకు నాధర్మసంకల్పము సిద్ధించునో లేదో యనుచింతతో నేనుంటిని. తగినసమయములో మీరందఱు నాకు సహాయపడి నన్ను సిద్ధసంకల్పునిగఁ జేసినందులకు నే నధిక కృతజ్ఞుఁడను. మీ రొనర్చిన యుపకారమునకుఁ దగు ప్రతిఫలమును భగవంతుఁడే మీకుఁ బ్రసాదించు నని నేను దృఢముగ నమ్ముచున్నాను. మీరు స్థాపింపఁబోవు వైద్యశాలవలన ననేక సహస్రజనులకు ననంతక్లేశ నివారణ మగును. ఏతత్సుకృతమునకు మీరును భాజనములు కావలెనని నేను జగదీశ్వరుని బ్రార్థించుచున్నాను. ఇట్లు పలికి, యాత్మశుద్ధితోఁ దైవధ్యాన మొనరించుచు మాధవుఁడు స్వర్గలోకమున కరిగెను.

## అధ్యాయము. 4.

—)o(—

కల్యాణపురము పూర్వకాలమునందు గంధర్వపురి యని చాల ప్రసిద్ధిగల రాజధానిగ నుండెను. ఆ పట్టణము సప్తకక్ష్యలతోఁ గూడి, యనేకసౌధరాజములతోడను, ధనదు నైశ్వర్యము నపహసించు గొప్ప వణిజులతోను, రేయుంబవళ్లు తమతమ మనీషాబలముచేతను, శరీరశక్తిచేతను, నగణ్యద్రవ్యము నార్జించు శిల్పిశ్రేష్ఠులతోను, నత్యున్నతములైన గోపురములు గల దేవాలయములతోను, ధర్మమార్గానువర్తులై రాజ్యతంత్రధురీణులగు నధికారులతోను,నద్వితీయు లగువిద్వజ్జనులతోను దేదీప్యమానముగ నుండెను. మాధవుని జ్యేష్ఠభ్రాతయగు సుమిత్రుఁడును, నతని కనిష్ఠసోదరుని కొమారుఁడగు శంబరుఁడును నిచ్చటనే నివాసము చేయుచుండిరి. మాధవుఁడు చెప్పినప్రకారము పరంతపుఁ డతని శవమును బెట్టెలో నుంచి భద్రముగా కల్యాణపురము చేర్చెను. ఇంతలో నచ్చట నతనిని నిరీక్షించుచుండిన భృత్యుఁడగు మంజీరకుఁ డతని రాకను విని, యతనిఁ బిలుచుకొనిపోయి, తాను మొదట నేర్పఱిచియుంచిన నివాసస్థలమున దింపెను. పరంతపుఁడు తన యొద్దనున్న ద్రవ్యమంతటిని రహస్యముగ నొక స్థలమున దాఁచి, మాధవునిశవముతో సుమిత్రుగృహముచేరెను. అప్పుడు చీఁకటిక్రమ్ముచుండెను. ఆభవనమునందు మహోత్సవసూచక మగు పెక్కుదీపములు వెలుఁగుచుండెను. చాలమందిజనులు శకటారూఢులై సుమిత్రుమందిరమున కేతెంచుచుండిరి. దీనినిజూచి, యీమహాసంరంభమునకుఁ గారణ మేమని విచారింపఁగా, నారాత్రి శంబరకామమోహినులకు వివాహనిశ్చయమగునని తెలిసెను.అప్పుడు పరంతపుఁ డీయుత్సవసమయమున సుమిత్రుని కీయశుభవర్తమానమును జెప్పి, యతనికి మనోవేదన గలిగించుట యనుచితమని నిశ్చయించుకొని, వెనుకకు మరలి, స్వస్థానమునకు వె

డలెను. అయినను, బరంతపుఁడు మొదట గంధర్వపురమునుండి మాధవుఁడు, స్వర్గస్థుఁ డైనట్లును, నతనిశవముతోఁ దాను వచ్చెద ననియు, వ్రాసిన లేఖ యాసమయమునకు సరిగా సుమిత్రుని హస్తగత మయ్యెను. అంతకు లోపుగనే యనేక బంధుమిత్రపరివారము విచ్చేసి యుండెను. సుమిత్రుఁ డాలేఖను, జించి చూచి, పిడుగుపడినభూజమువలె నేలఁ గూలెను. సభ్యులందఱును, గారణము తెలియకయే సంభ్రాంతులై హాహారవములను జేయుచుండిరి. శంబరుఁ డెక్కుడ కలవరముతో నాపత్రమును జదివెను. ఆకాగితమును జదువునంతలో నతనికిఁ గలిగిన సంతోషమునకు మేర లేదు. అయిన నాయానందమును వెలిపుచ్చక యధికశోకము నభినయించి, "అయ్యో! ఇంకేమిగతి! మాచిన్నాయన యకాలమృత్యువువాతఁ బడెను గదా! హా! హా!" అని, నేలపైఁబడి, దొర్లి దొర్లి గట్టిగా రోదనము చేయ నారంభించెను. దీనిని వినినంతనే కామమోహినికూడ నత్యంతశోకావేగముచే స్తబ్ధురాలై, స్వల్పకాలము తరువాత తెలివి వచ్చి దుఃఖించుచుండఁగా, సుమిత్రుఁ డామెకు శోకోపశమనము చేయుచుండెను. దీని నంతటిని జూచి, యచ్చటికి కరుగుదెంచిన పెద్దలందఱును బగితాపపడుచు, సుమిత్రుని దుఃఖోపశమనార్థము చెప్పవలసిన మాటలను జెప్పి, తమతమ స్వస్వగృహోన్ముఖులైరి. సుమిత్రుఁడు సహోదరుని గుణాతిశయములను దలపోయుచు, నతనికి సంభవించిన యకాలమరణమునకు సంతాపపడుచు నతని మరణ విషయకములగు పూర్వోత్తరములను జక్కఁగఁ దెలిసికోవలెనని పరంతపుని రాక కెదురుచూచుచుండెను. మఱునాఁడు పరంతపుఁడు సుమిత్రుని సమీపించి, కామమోహినీ వృత్తాంతము తప్ప, జరిగినసంగతుల నన్నిటిని దెలియఁజేసి మాధవుఁడిచ్చిన వజ్రపుటుంగరమును జూపెను. సుమిత్రుఁడు దానినిఁ జూచి యంతస్తాపముచేఁ గన్నీరు గార్చి,

"అయ్యా! పరంతపుఁడా! నేను మాధవుని యిష్టప్రకారము నడుచు కొనుట కేయభ్యంతరము లేదు. అయిన నిప్పుడు నీవలన నాకొక యుపకారము కావలసియున్నది. నాకు కామమోహిని యను పెంపుడుకూఁతురు కలదు. ఆమెను నాతమ్మునిపుత్త్రుఁడగు శంబరున కిచ్చి వివాహము చేయవలెనని యున్నాను. ఈకార్యము నెఱవేఱు దనుక మాధవుఁడు తనయాస్తి నంతటిని నీ కిచ్చిన సమాచారమును మాత్రము బయలుపఱుపఁ గూడదు. అట్లు కానియెడల, నీశుభకార్య మునకు విఘ్నము సేకూరును" అనిచెప్పఁగా పరంతపుఁడు "నేనే యీప్రస్తావము నెప్పుడును జేయువాఁడను గాను; అయినను, మాధవుఁడు తనయాస్తివిషయమునం దేలాగు వినియోగపఱుప వలెనని యేర్పాటు చేసె నని యెవరుగాని ప్రశ్నించిన పక్షమున నసత్యమును జెప్పుట నావలనఁ గాదు." అని బదులు చెప్పెను. అనంతరము, సుమిత్రుఁడు తన బంధుమిత్రులతో యథావిధిగ మాధవుని యుత్తరక్రియలను జరపి, పరంతపుని తనయింటిలో నుంచుకొని యుపచరించు చుండెను. శంబరుఁడును గామమోహినియు నచ్చటనే యుండిరి. క్రమక్రమముగఁ బరంతపునికి కామమోహినికిని పరస్పర గౌరవము వృద్ధినొందుచుండెను. స్వల్పకాలములోనే యీ గౌరవము ప్రేమరూపముగఁ బరిణమించెను. తుదకీ ప్రేమయే యిద్ద ఱికిని నొండొరులయెడ ననురాగ మయ్యెను. ఈయిరువుర యందును శృంగారచేష్టలు తరంగములుగ వృద్ధినొందుచుండెను. ఇట్లుండఁగా, నొకనాఁడు పరంతపుఁడు సంధ్యాకాలమున వాహ్యాళి కొఱకుఁ బోయివచ్చుచు, సుమిత్రుని యుపవనము చేరి, యచ్చటి పుష్పభరితారామ రామణీయకమును జూచి యానందించుచుండఁగాఁ గామమోహినియుఁ బుష్పాపచయవ్యాజమున నచ్చటి కరుదెంచెను.

కాంచ — మహనీయుఁడవగు పరంతపుఁడా! నేనుమీతోఁగొన్ని విజ్ఞాపనలను జేయవలె నని చాలదినములనుండి నిరీక్షించుచుంటిని. అయినను, దైవకృపవలన నిప్పుడవకాశము దొరకినది. మీరుచెప్పిన మాధవుని వృత్తాంతము విశేష విషాదకరముగ నున్నది. అతని యకాల మరణమునకు మందభాగ్యురాల నగు నేనే కారణభూతురాల నని చెప్పవలసియున్నది. ఎందువలన ననఁగా, నతఁడు నాయందను రక్తుఁడై యుండెను. నాకును నతనిమీఁద ననురాగము వృద్ధియగుచుండి నను, శంబరుని దుర్బోధచే నే నతనివిషయమున నుదాసీనురాల నై యుంటిని. నామనోభావమును గ్రహించినతోడనే, యతఁడీపట్టణమును విడిచిపోయెను. నీచుఁడగు శంబరుఁడు నన్ను వివాహమాడవలెననెడి సంపూర్ణప్రయత్నమునం దున్నాఁడు. దీని కనుకూలముగ సుమిత్రుఁడును నన్ను బలాత్కరించుచున్నాఁడు. ఈ శంబరుఁ డధికదురాత్ముఁడు. వీనిని వరించుటకంటె మరణమె యుత్తమమని భావించుచున్నాను. ఇప్పటికిని వివాహకాలమునందువిషపానముచేసి, ప్రాణమును బోఁగొట్టుకొనవలెననెడి దృఢసంకల్పముతో నున్నాను. శంబరుఁడు సర్వథా నాకనురూపుఁడు కాఁడు. మాధవుఁడు సత్యసంధుఁడు సకలవిద్యావిశారదుఁడు, ధర్మాత్ముఁడు, గుణనిధి. ఇట్టివానిని వదలి, గుణహీనుఁడును నిరక్షరకుక్షియు, నీచుఁడునైన శంబరుని పెండ్లి చేసికొనవలసినదురవస్థ నాకుఁ బ్రాప్తమైనది. దీనినుండి తప్పించుకొను నుపాయమేదియుఁదోఁచలేదు. ఈకతమున నివ్విషయములో మీరు నాకు సాహాయ్యము చేసి ప్రాణదాన పుణ్యభాగులరు గావలసిన దని మిమ్ములను నేను బ్రార్థించుచున్నాను.

ప — పూజ్యురాలా! చింతింపవలదు. నిన్నీకష్టమునుండి తప్పించు భారము నాది యనుకొమ్ము. నీవు మాధవుని గుణముల విషయము నందుఁ జెప్పిన దంతయు సత్యము. అట్టివాఁడు దొరకకపోవుట నీ

దౌర్భాగ్యమనియే భావింపవలెను. స్త్రీల కట్టిపతులు దొరక వలసిన యెడల జన్మాంతరములందు సుకృతములను జేసియుండవలెను. అయినను, మిాఱిన కార్యముకొఱకు చింతించుట గతజలసేతుబంధనముకదా? మాధవుఁడు పరలోకవాసియై యున్నాఁడు. అతఁ డొనర్చినధర్మకార్యములు మాత్రమే దిగంతవిశ్రాంతములై స్థిరముగ నుండును. అతఁడు ప్రాణోత్క్రమణకాలమునందుఁ గూడ నీగుణాతిశయములనే స్మరించుచు, నీ యాదాసీన్యమునకు శంబరదురోభ్ధయే కారణమని గ్రహించి, నీకిచ్చుటకుఁగాను నయిదువేల రూపాయలను నావశమున నిచ్చియున్నాఁడు. ఆ ద్రవ్యము నిచ్చెదను. దానితో నీవు పరాధీనురాలవు కాకుండ స్వతంత్రజీవనము చేయుచు సుఖముగ నుండవచ్చును.

కా—నేను నిర్భాగ్యురాలను; నాదౌరాత్మ్యమునకును, నౌదాసీన్యమునకును దగినఫలము నిప్పుడు నే ననుభవింపవలసివచ్చినది. ఆమాధవుఁడు తన యంత్యకాలమునందుఁగూడఁ బాపిని నగు నన్ను స్మరించుచు, నే నతనియెడలఁ జూపిన తిరస్కారమును మనస్సునం దుంచక, యీధనమును నీచేత నాకుఁ బంపియుండుటయే నాకు మర్మభేదనము చేసినంత దుస్సహసంతాపము కలిగించుచున్నది. అయ్యా! పరంతపా! నాకు ద్రవ్యాపేక్ష స్వల్పముకూడలేదు. ఎట్టి సంపత్సమృద్ధికాంక్షయు, నాకు లేదు. ఆ కుటిలశంబరుని కధీనురాలను గాకుండుటయే చాలును. సేవావృత్తివలన నైనను జీవించుచుఁ గాలమును గడపెదను. నా యాయుఃపరిమాణావధిగ మాధవద్రోహము చేసితి నను ననుతాపము నన్ను విడువదు. మాధవుఁడు నాకిమ్మనిన ద్రవ్యమును మిాశ్రమమునకుఁ బ్రతిఫలముగఁ గైకొని నాకీబంధమోచనను జేసినయెడల నామరణాంతము కృతజ్ఞురాల నగుదును.

ప—ప్రతిఫలాపేక్షలేని పరోపకారమే పరమధర్మ మగును. నేను ధనలాలసతో నుపకారము చేయువాఁడనుగాను. మాధవుఁడిచ్చిన ధనము త్వదీయము. దీనితో బంధమోచనను జేసికొనవలెననెడి సంకల్పము నీ కున్నపక్షమున, ద్రవిణకాంక్షగలవారి నెవరినైన వెదకుము. నేనే నీకార్యమును జేయఁ గోరుదువేని, నేను ధర్మార్థముగఁ జేయువాఁడనే కాని, యెప్పుడును బ్రతిఫలాపేక్షినిగాను.

కా—ఆర్యవర్య! నామాటలవలన మీకాగ్రహము గలిగినట్లు తోఁచుచున్నది. నాయపరాధమును క్షమింపుఁడు. దుఃఖాతిశయముచే యుక్తాయుక్త వివేచన లేక యాడినమాటలకు మీరు కోపించినయెడల మీదయాళుత్వ మేమైనది? అనాథనై సంకటపడుచున్న నన్ను రక్షింపుఁడు. సుమిత్రుఁడు నన్ను నీచున కిచ్చుట నిజము. నేను మీకు శరణాగతను. ఇఁకఁ గపట మెందుకు? నాయంతరంగమును దెలిపెదను. మీరిటకు వచ్చినది మొదలు నాకు మీయందనురాగగౌరవములు దినదినము వృద్ధియగుచున్నవి. కాఁబట్టి మీరు నన్ను వరించినచో నేను బ్రతికియున్నంతకాలము త్రికరణములచేత మీకిష్టానువర్తినినై యుండెదను. అట్లుగాక, శంబరునినే వివాహమాడవలసిన విషయమున నే నాత్మహత్య చేసికొనుటయే నిజము. కాఁబట్టి, నాకష్టములను నివారించి, నన్ను బ్రతికించుటకు మిమ్ము శరణు జొచ్చితిని. ఇది మొదలు నాప్రాణమానముల రెంటికిని మీరే నియామకులుగ నుందురు.

ప—శరణాగతరక్షణముకంటె నుత్కృష్టమగు ధర్మము వేఱెద్దియునులేదు. నిన్ని యాపదనుండి తొలఁగించెదను. ఈవిషయములో నాకెట్టివిపత్తులు సంభవించినను సరకు గొనను. అయినను నిన్ను వివాహము చేసికొనవలె ననునభిలాషతో నేనీకార్యమును జేయువాఁడను గాను. ప్రస్తుతము నేను నీయిక్కట్టునుతొలఁగించి, నీకష్టనివారణము చేసెదను. పిదప నీకు నాకంటె నుత్తముఁడగు పురుషుఁడు దొరక

గలఁడు. అట్టివాఁడు దొరకనిచో నపుడు పర్యాలోచనము చేయుదము. అయినను నన్నొక యనుమానము బాధించుచున్నది. ఏమనఁగా, నీవు శంబరుని వివాహము చేసికొననిచో, బాల్యమునుండి యిదివఱకు నీ కెట్టి బాధయు లేక నిన్ను సుఖముగాఁ బెంచుచు వచ్చిన సుమిత్రున కత్యంత క్లేశము కలుగును. అప్పుడా నీవు కృతఘ్నురాల వను లోకాప వాదమునకు గుఱి యగుదువు కదా!

కా—ఈసుమిత్రుఁడు నాకు మహోపకారమును జేసినవాఁడే యగును. ఇతఁడు నన్ను తల్లిదండ్రులవలె ప్రేమాతిశయముతోఁబోషించెను. ఇతఁడే నాకేమగడ. జీవితావధిపర్యంతము నతనికి సేవచేసినను, నితనిమహోపకారమునకుఁ దగినప్రత్యుపకారము కాఁజాలదు. అయినను బిడ్డలకుఁ దల్లిదండ్రులు సమస్తవిషయములందును నియామకులైనను, ధర్మపథమును వదలివేసి ప్రవర్తించుట వారికిఁ దగినది కాదు. తల్లిదండ్రులు బిడ్డలను బెంచిన మాత్రముననే యుక్తాయుక్తవివేచన లేక, వారి కనుచితకార్యములను నేర్పి, వానినిఁ జేయనియెడల వారిని గృతఘ్నులనుట తగునా? ఈ శంబరుఁడు వ్యభిచారి; వ్యాధిబాధితుఁడు; మోసకాఁడు. చౌర్యాద్యనేకదుష్కృత్యములను జేసి పెక్కుపర్యాయములు రాజ్యాధికారులచేఁ గ్రూరశిక్ష ననుభవించినవాఁడు. ఇట్టివానిఁ జెట్టపట్టుమని నాజనకుఁడు నిర్బంధింపవచ్చునా; ఈ విషయము నాకుఁ బ్రియము లేదని చెప్పిన మాత్రమున నేను గృతఘ్నురాల నగుదునా; సుమిత్రుఁ డొనర్చిన మేలు నెప్పుడుగాని మఱచుదానను గాను. న్యాయరీతినిఁ జెప్పిన పక్షమున, నతనికొఱకు నాయసువులైన నొప్పగించుటకు సిద్ధముగ నున్నాను. ఈశంబరుని పత్నిగ మాత్రము నే నెప్పుడును గాఁజాలను.

ప—నీమాటలు నాకత్యాశ్చర్యకరములుగనున్నవి. సుమిత్రుఁడు చాల ధీశాలి యని వినియున్నాను. నీయెడల సంపూర్ణవిశ్వాసముండు

నట్లు స్ఫురించుచున్నది. శంబరుఁ డట్టి దుర్గుణయుతుఁ డైన యెడల ప్రాణసమాన వగు నిన్నతని కిచ్చి యుద్వాహము చేయుట కెందులకు సుమిత్రుఁడు సంకల్పించును? ఆవిషయ మటుండనిమ్ము. నీవు కోరినట్లు నీవు శంబరుని భార్యవు కాకుండునట్లు చూచు భారము నాది. ఇఁక చింతింపక పొమ్ము.

కా—నాప్రార్థన యింతేకాదు. నన్ను మీరే పెండ్లిచేసికొన వలెనని కూడ నాయొక్క ముఖ్యమైన కోరిక. మీ సంభాషణవలన నన్ను వరించుటయందు మీకు సమ్మతి లేనట్లు తోఁచుచున్నది. ఇట్లుండినచో మీసహాయము వలన నాకుఁ గావలసిన యుత్తరఫల మేదియుఁ గానరాదు. మీ యాగమనము మొదలు సర్వేశ్వరుఁడే మిమ్ముల నిచ్చుటకై పిలుచుకొని వచ్చెననియు, తల్లిదండ్రులచేతను బంధువుల చేతను విడువఁబడిన యనాథ నయినను మిమ్ములను జూచి సనాథనని భావించుచుంటిని. సామాన్యముగా స్త్రీలు తను యను రాగమునకుఁ బాత్రులగు పురుషులకు స్వాభిప్రాయమును వ్యక్తముగఁ దెలియఁజేయరు. ఇట్టి సంకోచమును, లజ్జను వదలివేసి, మీసుగుణాతిశయము కొఱకు నేనే మీ కధీనురాల నగుచున్నాను. ఇట్టి నన్నుఁ దిరస్కరించుచో మీవలన నాకుఁ బెక్కు లనర్థములు సంభవించును. కాఁబట్టి యిఁక నొక నిమిషార్థములో నాసుమిత్రశంబరుల సంకల్పములను భగ్నపఱిచి, నేను ప్రాణత్యాగమును జేసికొనెదను.

ఇట్లు పలికి, కామమోహిని తన సమీపమున నుంచియున్న విషమును దీసికొని నోటిలో పోసికొనఁ బోయెను. ఆ క్షణముననే పరంతపుఁ డామె చేతులను గట్టిగఁ బట్టుకొని, బలాత్కారముగ విషమును లాగుకొని, దాని నొక కాగితములోఁ జుట్టి తన జేబులో నుంచుకొని, యిట్లు పలికెను:—"ఓ మంగళాంగీ! నీదృఢసంకల్పము నాకత్యాశ్చర్యమును గలిగించినది. నిన్ను వరింపఁ గూడదని నేను నుద్దేశించినవాఁడను గాను; నీకు పురుషాం

తరమునం దనురాగముండిన పక్షమునఁ బ్రత్యతిబంధకమగు నీ విపత్తును దప్పించి, నీకోర్కెసఫలమగునట్లు చేయ నెంచితిని. నీ వసామాన్య సౌందర్యవతివే కాక, దాని కనురూపగుణాతిశయము గలదానవు. నా కంటె రూపవంతులును, విద్యావంతులును, గుణాఢ్యులు నైన మహాత్ములు లోకమునం దెందఱో కలరు. నీ వట్టి మహాశయులలో నొకరిఁ జేట్టపట్టి, వానిని బరిణయమాడి, సంతోషపడవచ్చునని నేను చెప్పితినే కాని నీవు నాకనురూపవు గావనియు, నీకంటె సుందరాంగి యగు వనిత నాకు లభింపఁగల దను సహంకారముతోఁ జెప్పినవాఁడను గాను. ఇప్పుడుకూడ నివిషయమును జక్కఁగా పర్యాలోచనము చేసి. నీవు నాకాప్తురాలగు రమణివైన యెడల నెట్లో, యావిధముననే ప్రవర్తించెదను. సుమిత్రశంబరులవలన రాఁగల విపత్తును దప్పించెదను. తరువాతఁ బాణిగ్రహణార్థము నిన్ను వరింపనెంచి వచ్చిన వారిని బరీక్షించి, వారిలో నాకంటె నుత్తముఁడు లేనియెడల నేనే నిన్నుఁ బరిణయము చేసికొనియెదను. ఇందులకు వలసిన ప్రతిజ్ఞలను జేసెదను. ఇప్పటికైన దుఃఖమును మానుము.

కా—ఓమహనీయుఁడా! వివాహమున కనురాగమే ముఖ్యకారణము. విద్యావంతులును, రూపవంతులును నైన వేనవేలు జనులు నావిచారమును విని, యచ్చటికేతెంచి సుమిత్రుని బ్రార్థించిరి. వారిలో నెవ్వరిని గాని నామనస్సు మెచ్చుకొనలేదు. శంబరునికి నన్నిచ్చి పాణిగ్రహణము చేయించవలెనని సుమిత్రుఁడు ప్రయత్నింపఁగా వానిని ధిక్కరించుట కంటె దేహత్యాగమును చేసికొనుటయే యుత్తమమని నిష్కర్ష చేసికొని, యీవిషమును దెప్పించుకొంటిని. నిశ్చయకాలమునం దీగరళమును దీసికొనుట కుద్దేశించితిని. మాధవ మరణసమాచారమువలన వివాహనిశ్చయోత్సవభంగము సంభవించుట వలనను, మఱునటి దినముననే మీ సమాగమలాభము కలిగి, క్రమ

క్రమముగా మీారే నాకనఃరూపులను భావన యంకురించుట చేతను, నేనింతదనుక దేహధారణము జేయఁగలిగితిని. నేను త్రికరణశుద్ధిగా మిమ్ములనే వరించుచున్నాను. మీాకిది సమ్మతమైనచో నాయిష్టము నెఱవేర్పుఁడు; అట్లు కానియెడల బలాత్కారముగ ప్రాణమునంటి పట్టుకొనియున్న నాకు శోకపరిహారక మగు నీసిద్ధౌషధము నిచ్చి యిచ్చటనుండి పంపివేయుఁడు.

ప — అనేక జన్మసుకృతములచే నీవంటి సువణాంతురాలు లభ్యయగును; నీవీరీతిని నన్ను వరించుట నా భాగ్యపారిపాకమే. కాఁబట్టి, యీనియమము మొదలుకొని, నేను నీయాజ్ఞాను వర్తినై యుందును. శంబర సుమిత్ర భయోత్పాత భావనను వదలుము. ఇప్పుడు నీయభిమత సూచకలేఖను వ్రాసి సుమిత్రున కంపుము. నీకీపురవాసులలో నెవ్వరైన సఖు లుండినచో వారి మందిరమున స్వల్పకాల మజ్ఞాతవాసము నడపుము. నాకు సుమిత్రునివలన జరగవలసిన కార్యములు కొన్ని గలవు. వానినిఁ బూర్తిచేసికొని, నీ వివాహార్థము నేనువచ్చెదను.

కా — ఓపూజ్యుఁడా! ఆర్యకీర్తియనునామధేయముగలనామిత్రు రాలొకతె యీపురమునం దున్నది. ఈపెకు ముసలు లగు ప్రసూ జనయితలు గలరు. వీరు కడు బీదలు. వీరి కుటీరమున నజ్ఞాతవాసము చేయుట సులభమని భావించుచున్నాను. అది యటుండనిమ్ము. సుమిత్రుని గృహమునందు మీా కేమిపని? అచ్చట నుండినచో మీాకనే కాపదలు గలుగనగును. నామనోభీష్టము శంబరసుమిత్రులకుఁ దెలియుటకు మునుపే యీాకార్యములను సాధించుకొనుట మంచిది.

ప — (వేయిరూపాయలనోటులనిచ్చి) వీని నార్యకీర్తి తండ్రి కిమ్ము. శంబరసుమిత్రులవలన నేభయమువచ్చినను, నేను దాని నడ్డుచేయగలవాఁడను. మాధవుఁడు తనయాస్తి నంతటిని నాపేర

వ్రాసి కాలగతుఁ డయ్యెను. దానిని స్వాధీన పఱచుకొనిన తర్వాత నుద్వాహసన్నాహము చేసెదము.

కా—ఓ పరంతపా! నీపలుకు లధిక భయాస్పదముగ నున్నవి. శంబరుఁడు మాధవుని సర్వస్వమునకుఁ దానే హక్కుదారుఁడ నని యూహించుచున్నాఁడు. సుమిత్రుఁ డతని పక్షపువాఁడు. లోకమున సంపద్విపత్తులు గలిసియుండును గాన మాధవ ద్రవ్యాపేక్ష నీకున్నచో ననేక కష్టములకు నీవు గుఱి యగుదువు. ఐశ్వర్యవృద్ధితోఁ దాపత్రయ వృద్ధి యగుచుండును. ఐశ్వర్యవంతులుగ నుండుటకంటె, దేహపరిశ్రమ చేతను, బుద్ధిచాతుర్యముచేతను, ధర్మలోపములేక, లభ్యమగునంత సంపాదించుకొని, బీదసాదలవలె జీవించుట యుత్తమము. ఈ సంపద నంతను శంబరునికి విడువుము. ఈభాగ్యమువలనఁ గలుగు సౌఖ్యము కంటె నధిక ప్రమోదమును నేను మీకు గలిగించెదను.

ప—ఈ మరణదానపత్రవిషయము నేను సుమిత్రునికిఁ దెలిపితిని. అతఁ డీద్రవ్యము నంతను నాకు వశపఱచుట కంగీకరించి యున్నవాఁడు. శంబరునివలన లేశమాత్రమును భయము నాకు లేదు. ఈ సంపదను సాధించెదను; ఇట్లు చేయుట ధనకాంక్షవలనఁ గాదు; మాధవుఁడు నిధనకాలమున నావలనఁ బొందిన కొన్ని వాగ్దానముల కొఱకు నీకార్యమును జేయవలసి యున్నది. సుమిత్రాగమనమునకు వేళ యయినది. నీతో సల్లాపమునకుఁ గాలము చాలదు. నీవు జాగరూకతతో నీయాప్తమిత్రగృహమును బ్రవేశింపుము.

కా—మీయాజ్ఞ ననుసరించి నడచెదను. సర్వేశ్వరుఁడు మీ కేదుఃఖము రాకుండఁ గాపాడుఁగాక! అని పలికి కామమోహిని యెవరికిని తెలియకుండ నార్యకీర్తి కుటీరమునకు వెడలెను. పరంతపుఁడు సుమిత్రగృహమును జేరఁబోయెను.

---

## అయిదవ అధ్యాయము. ౫.

ఈరీతిని కామమోహిని తనపాలకపితమందిరమును వదలిపెట్టి పోయిన దినముననే శంబరున కీపె నిచ్చి, యుద్వాహము చేయునట్లు దృఢపఱుప, ననేక బంధుమిత్రులకు లగ్నపత్రికలు పంపఁబడెను. కామమోహిని వెడలిపోయిన కొంచెము సేపటిలో శుభకార్యాహ్వాన పత్రిక లందినవా రొకరుగ రాఁదొడఁగిరి.

ఇట్లువచ్చు నతిథులకు స్వాగతమిచ్చి, సుమిత్రుఁడు వారితో సల్లాపించుచుండ నొక సేవకుఁడు రెండు కాగితములను సుమిత్రసేవకున కిచ్చి వెళ్ళెను. పరంతపుఁడు పైవిలాసములను దూరమునుండియే పరిశీలించి, యీలాగున తలఁచెను. "ఇవి కామమోహిని వ్రాసిన లేఖ లుగ నున్నవి. వీనిని పఠించినతోడనే సుమిత్ర శంబరుల కనిర్వచనీయ మగు ఖేదము కలుగుటయేకాక, వీరికి నామీఁద ద్వేష ముద్భవించును. ఈపగనుండి తప్పించుకొనుటకు కామమోహినికిఁ బితృభక్తికృతజ్ఞతలను గూర్చి కూడినంతవఱకు బోధించితిని. వీరి ద్వేష మధికమై నాయొద్ద నుండు మరణదానపత్రము, సువర్ణాంగుళీయకము, తదితర పత్రములు, ద్రవ్యము మొదలగు వానిని వీరు స్వాధీన పఱుచుకొనుటకు మార్గము నన్వేషింపవచ్చును. మఱియు, నపరాధులను వెదకు విషయమునందు సర్కారువారు నాకిచ్చిన సన్నదుకూడ నాయొద్దనున్నది. ఇప్పుడు వీనిని భద్రపఱుపకపోయినయెడల సకలానర్థములు జనించును. అని యోచించి, యాక్షణముననే వానిని తోఁటలోని యొక రహస్య ప్రదేశమునందలి యొక శిలక్రిందఁ దవ్వి, యాపల్లమునందు పత్రముల నన్నిటిని దగరపుపెట్టెలోనుంచి, పైని మన్ను పోసి, పల్లమును పూడ్చి వేసి యతిథులబృందములోఁ గూర్చుండెను.

ఇట్లుండఁగా, సుమిత్రుని భృత్యుఁ డా రెండుజాబులను తన యజమానుని కిచ్చెను. వాని పై చిరునామాలను జూడఁగానే, సుమిత్రునికి కలవరము కలిగి, వానివిజింపి చూచెను. ఒకదానియం దిట్లు వ్రాయఁబడియుండెను.

పితృసమానుఁడైన సుమిత్రునిచరణసన్నిధానమునకు:—

సేవకురాలైన కామమోహిని సాష్టాంగ నమస్కారపూర్వక విజ్ఞాపనలు.

క్షేమోపరి. నాచిన్నతనమునందే నా పితరులు గతించిరి. నా కూహ వచ్చినదిమొదలు మిమ్ములను ప్రసూజనయితలుగ భావించుచున్నాను. ఆబాల్యము స్వకీయ పుత్రిక కంటె నధిక వాత్సల్యముతోఁ బెంచి, నాకు విద్యాబుద్ధులను నేర్పితిరి. దీనికి నే నెంత కృతజ్ఞురాలుగ నున్నను జాలదు. ఇందులకు నేను ప్రాణము నొప్పగించియైనను నా కృతజ్ఞతను జూపుటకు సిద్ధముగ నున్నాను. అయినను, ఈదినము బలాత్కారముగ నన్ను శంబరుని కిచ్చి కళ్యాణమహోత్సవము నడపించునట్లు నిశ్చయించి, బంధుమిత్రపరివారములను బిలిపించు ప్రయత్నము జరిగినది. ప్రథమమునుండియు నీవిషయమున నాకుఁగల యభిప్రాయమును నేను ధారాళముగ మీకుఁ దెలుపుచునే యుంటిని. శంబరుని శీలము, గుణాతిశయములును మీకుఁగూడఁ దెలియనివికావు. మీరుచేయు బలాత్కారమువలనఁ దీవ్రమనోవేదన కలుగుచున్నది. మీరు చేయు ప్రయత్నములవిషయము మీమనస్సులో యోజింపుఁడు. నాకు సమస్తవిషయములందు ననురూపుఁ డగు వరుని కిచ్చి వివాహము చేయుట మీకు కర్తవ్యము కాదా? సర్వవిధముల నా కనురూపుఁడగు మగని కిచ్చి, బలాత్కారముగవివాహముజరుపుట మీకునుచితమా? మీప్రయత్నము నాకొక్కతెకే యనభిమతమైనదికాదు. ప్రథమమున నిశ్చయమనుకొన్న దినముననే మాధవుఁడు స్వర్గస్థుఁడైనసంగతి తమకు శ్రుతమై యాయుత్సవమునకు భంగము జరిగినందున నీసంబంధము పరమేశ్వరునికిఁగూడ ననిష్టమని యూహింపవలసియుండును. మీప్రయత్న

ఫలము ననుభవించుట కిష్టములేక నేను మీానికేతనమును పరిత్యజించి నిర్గమించుచున్నాను. ఈ పాణిగ్రహణముతప్ప, నాకు వే ఱెట్టియుత్త రువు చేసినను, నేను దానిని శిరసావహించి జరపుటకు సిద్ధురాలను. నాయపరాధమును క్షమింపుము.

నిరంతర విధేయురాలగు

మీా కా మ మో హి ని.

ఈజాబును జదివినతోడనే సుమిత్రుఁడు విస్మితుఁడై, యత్యంత సంతాపపరవశుఁడై, తా నాహ్వానముచేసిన బంధుమిత్రుల యెదుట దుస్సహమగు నవమానము కలిగినదికదా! అని పరితపించుచు, గభీలని లేచి, కామమోహినిగదికిఁ బోయి, యామె యచ్చట లేనందున, మందిర మంతటను వెదకి యెచ్చటనుగానక, యుపవనమంతయుఁ దిరిగి యచ్చోటునను లేనందుచేఁతబరంతపుఁ డొకవేళ నీమె నపహరించుకొని పోయెనేమో యను సంశయమునఁ దిరిగి యింటికి వచ్చెను. పరంతపుఁ డతిథులతో సల్లాపమాడుచుండుట చూచి, తాను తలఁచినది యసంభవమని గ్రహించి, యత్యంత వ్యసనముతో శంబరుని గదిని సమీాపించి, తత్కాలోచితముగ, వివాహాలంకారములను ధరించుచున్న యతనికి నాయుత్తరమునిచ్చి, తలవంచుకొని, నిశ్చలముగనిలుచుండెను. శంబరుఁ డితనిముఖభావమువలన కలవరపడి, తనపేరు, పై విలాసము గల లేఖను దెఱచి, చదువుకొనెను. దానియం దిట్లు వ్రాయఁబడి యుండెను:—

సహోదర సమానుఁడగు శంబరునకు-

కామమోహిని విజ్ఞాపనము.

నీస్వభావము, నీగుణము, నీయింద్రియపరవశత, వీని నన్నిటిని నేను బాల్యమునుండి చూచుచుంటిని. సహోదరభావముచే వీనిని చూచి చూడనట్లుంటిని. ఈవిషయమును గ్రహింపక, నాయెడల

నీవు ప్రేమచూపుట యధికాశ్చర్యముగ నున్నది. వివాహ మాడఁ దలఁచినవారు పరస్పరానురక్తులుగ నుండవలెను. నీవు నాయందుఁ జూపు ననురాగమునకు సరియగు ప్రీతి లేశమాత్రముకూడ నీ యెడల నాకు లేదు. నీతో సంభాషణ గాని, సహవాసము గాని, తుదకు నీ వుండుపట్టణమందు నివాసముగాని చేయఁగూడ దనుభావము నా మనస్సున నెలకొని యున్నది. ప్రాణమునైనఁ గోల్పోవుదును గాని నిన్ను నేను వివాహ మాడుదానను గాను. నాయందు వ్యామోహము వదలి, నీకనురూపురాలుగ నుండు భామను వెదకి యామెను చేపట్టి, సుఖముగ నుండుము. నేనుచెప్పిన సలహాను వినినచో మన కిద్దఱకును మేలు సంభవించును. కాని యెడల, మనము మన బంధుజనముతో నెక్కువ సంతాపమునకు గుఱియగుదుము. చక్కఁగాఁ నాలోచించి, నీకుఁ దగిన రమణిని వరించి, నీవు సుఖముగ జీవించుదు వని నమ్మియుండు

నీ సహోదరి యైన,
కా మ మో హి ని.

ఈ లేఖను చదువుట తోడనే శంబరునకు విపరీతక్లేశము జనించెను. ఆదుఃఖమువలన శంబరునకు క్రమక్రమముగ పూర్వాపరజ్ఞత తప్పిపోయెను.

శం—(కొంతసేపటికి) సుమిత్రుఁడా! ఈ పెకు నామీఁద నింత ద్వేష ముండియుండలేదు. ఈలేఖను చూడఁగా నీపె మనస్సు కౌర్యము వహించిన దనియు, దీనికి పరంతపుఁడే ముఖ్యకారణ మనియుఁ దెలియుచున్నది. ఇతఁడు మనగృహమునకు వచ్చినది మొద లీపెనడవడికయం దెక్కువ మాఱుపాటులు కనఁబడుచున్నవి. ఇతనికిఁ దగిన ప్రతీకారమును జేసెదను. అని పలికి, రోషావేశముతో పిస్తో లును దీసి గుఱిపెట్టి కాల్చుటకు నిశ్చయించుకొనెను.

సు—ఓరీ శంబరా! నీయాగ్రహము నణఁచుకొనుము. ఇవ్విషయమునఁ బరంతపుఁడు నిరపరాధి యని తోఁచుచున్నది.

శం—అదియెట్లు?

సు—కామమోహిని నిన్ను చేపట్టనని నాకును నొక జాబును వ్రాసియుండెను. ఈ రెండులేఖలు నాకుఁ జేరినతోడనే, నాయుత్తరమును జదివికొని, కామమోహిని నెక్కడెక్కడనో వెదకితిని. ఎందును కనఁబడనందున, పరంతపుని విషయములో నాకును ననుమానము జనించెను. కాని యింటికిఁ దిరిగివచ్చి చూడఁగా, నతఁ డతిథులతో వినోదసల్లాపము లాడుచుండెను. ఈ దురాలోచనలోఁ జేరియున్న పక్షమునఁ బరంతపుఁ డామెతో లేచిపోయియుండునుగదా!

శం—కామమోహినిని నొక నియమితస్థలమునకుఁ బంపి యీరీతి నభినయించు చుండఁ గూడదా?

సు—అట్లుండిన నుండవచ్చును. కాని యతఁ డిప్పు డతిథుల మధ్యనున్నాఁడు. ఈసమయమునఁ దొందరపడుట గూడదు. ఇంతే కాక, కామమోహిని యన్వేషణమునకు చారులను బంపియున్నాను. ఆమెను బ్రతిమాలి, నీ విషయమునందు ప్రసన్నురా లగునట్లు చేసెదను. నీవు త్వరపడవలదు.

సుమిత్రుఁ డిట్లుపలికి, యతని పిస్తోలును, మఱియు నితరాయుధములును నొక కొట్టెడిలో పెట్టి బీగమువేసి, భావికార్యప్రయత్నములను జేసెదనని బయలుదేఱి పోయెను. శంబరుఁ డున్మత్తప్రలాపములను జేయుచు నడుమ నడుమ రేఁగుచు, పరంతపునిఁ దిట్టుచు, వేదురువలెఁ బ్రవర్తించుటకుఁ బ్రారంభించెను. తోడనే, సుమిత్రుఁడు కొంతమంది భృత్యులను బిలిచి, శంబరుని విడువఁగూడదని యేకాంతముగవారితోఁ జెప్పి, తాను తన గదిలోనికిఁబోయి, పరంతపునికి నొకచీటి వ్రాసి పంపెను. తక్షణము పరంతపుఁ డతని గదికి వచ్చెను.

సు—అయ్యా! పరంతపుఁడా! నిన్ను నేను పుత్రప్రేమతోఁ జూచుచున్నాను. నీవు మాధవుని యవతారమని భావించి నీయెడల భ్రాతృవాత్సల్యము గలిగియున్నాను. మద్విషయమున నీవు సౌహార్దము గలవాఁడవై యుండుట యావశ్యకముకాదా?

ప—అదేమి యిట్లు పలుకుచున్నావు? నీభావన లెట్లున్ననుసరే. నాకునీయందు పితృభక్తి విశేషముగ నున్నది. నీవిట్లు మాటలాడుట యధికసంతాపకరముగ నున్నది.

సు—నాయెడల నీకుఁ బితృభక్తి యున్నచోఁ గామమోహిని యిప్పుడెచ్చటనున్నదో తెలుపుము.

ప—ఆమెకాప్తులగువారి దగ్గఱ నున్నది.

సు—ఆమెను బాల్యమునుండి పెంచి, పోషించి, పెద్దదానినిగాఁ జేసిన నాకంటెనాప్తు లెవరు?

ప—దీనికిఁ బ్రత్యుత్తరము నామెయే యీయవలెను.

సు—(ముడిపడినకనుబొమలతోను, వణఁకుచున్న సర్వావయవములతోను) ఏమంటివి? ఈప్రశ్న కామెయే బదులు చెప్పవలెనుగా? ఆమెకుదుర్బోధనచేసిన నీ కీప్రశ్నకుత్తరమిచ్చుట యసాధ్యమో; ఆమె నివసించుచోటు నీకుఁదెలియును. ఇప్పుడే యామెను జూపినసరి. అట్లు కానిచో,నీదౌరాత్మ్యమున కుచితఫలము ననుభవించెదవు.

ప—ఆమెవాసస్థానమును నేను గుర్తెఱుఁగుదును. అయినను, దానిని నీకుఁ దెలుపను. నీగృహమునందు నేను ప్రవేశించినది మొదలు, పెద్దమనుష్యునివలె ప్రవర్తించితినేగాని దుర్మార్గునివలె నడచుకొనలేదు. కావున, దౌరాత్మ్యఫలమును నేననుభవించువాఁడనుగాను.

సు—నీవు ఖలుఁడవేకాదు. కృతఘ్నుఁడవు గూడ, నగుదువు. నీవుమద్గృహాగమనానంతరము నావలన సత్కృతుఁడవై, గృహచ్ఛిద్రకారకుఁడవై,కామమోహిని మనస్సును త్రిప్పివైచి, శంబరునియందు

జుగుప్సను గలుగఁజేసి, యామెనపహరించి, యిష్టజనబంధుమిత్రులకును, నాకును నవర్ణనీయమగు శోకమును బుట్టించితివికదా! శంబరుఁడీసమయమున బుద్ధిభ్రంశమును బొంది, యున్మత్తావస్థలో నున్నవాఁడు. నేనో జీవన్మృతుఁడను. నీవే యీ సర్వానర్థములకును కారణభూతుఁడవు. కామమోహినిఁ జూపింతువా? లేక నీ దుశ్చేష్టలకు నీయుసురును భూతబలిగా నర్పింతువా?

ప—ఓసుమిత్రా! నీవు స్థవిరుఁడవు; మద్విశ్వాసపాత్రుఁడవు; నా సుహృదుఁడగు మాధవుని సహోదరుఁడవు. ఈకారణమువలన నీవు కోపోద్రేకపరవశుఁడవై యుక్తాయుక్తవిచారవిహీనుఁడవై యాడిన దుర్భాషలను మన్నించెదను. నీవునాయం దారోపించిన యపరాధములన్నియు నసత్యములు. నేను నీమందిరమునకు వచ్చి స్వాగతమును బడసినదినిజము; అయినను, ఈసత్కారబలమువలన నీ విట్టి దోషముల నారోపింతువని తెలిసియున్నచో, నీగృహమునందు గంగామృతపానముకూడ చేసియుండను. నేను కామమోహినికి దుర్బోధ నొనర్చినవాఁడను గాను; త్వదీయగృహమునందు గృహచ్ఛిద్రములు గల్పించినవాఁడనుగాను; కామమోహిని నపహరించినవాఁడను గాను; ఈ యారోపణలను నీవు వెనుకకుఁదీసి సవరించుకొనక పోయినయెడల, నీకుచితప్రతీకారము నొనర్చెదను.

సు—ఈ కామమోహిని శంబరుని కియ్యవలె నని నేను నిశ్చయముచేసినది నీకుఁ దెలియదా? ఇవ్వివాహవిఘ్నకారకుఁడవు నీవు గావా?

ప—కామమోహిని శంబరుని వివాహమాడఁగూడదను నభినివేశమునాకు లేదు; దీనికి నేను విఘ్నమును జేయలేదు. తనయాస్తిని దీసికొని దానితోఁ గొన్ని వినియోగములను జేయుమని మాధవుఁ డాజ్ఞాపించుటచేతను, నిన్నుఁ జూడుమని కూడఁ జెప్పియుండుటచేతను

నేను నీ సన్నిధికి వచ్చితిని. నీకోరికప్రకారము మాధవమరణదానపత్రిమును ఈ వివాహముజరుగువఱకును బహిరంగ పఱుపక యుంటిని. ఇట్లుండ, నిట్టి దురాలోచనలను నీవు చేసితివి. తోడనే వీనిని దిద్దుకొనుము.

సు—నీవు దొంగవు; బొంకులాఁడవు; ద్రోహివి; అసాధారణదౌష్ట్యము నొనర్చి, నన్ను బెదరించుచున్నావా? నీదుర్మార్గమునకు శంబరుఁడు రౌద్రావిష్టుఁడై యున్నాఁడు. నేను నిరోధింపనియెడల నతఁడు నిన్ను సంహరించియుండును. ఇప్పటికైనను నీకు విపత్తు తప్పలేదు. కామమోహినిని జూపుదువా? లేక నీ దుర్మార్గోచిత ఫలమును బొందుదువా?

ఇంతవఱకు ప్రసన్నుఁడై మందహాస పూర్వకముగ మాటలాడుచుండిన పరంతపుని కీ పలుకులవలన నాక్రోశ మావహించెను. అప్పుడే యతని కనుబొమలు ముడివడెను; నయనము లెఱ్ఱ నయ్యెను. తోడనే లేచి—

ప్ర—ఓసుమిత్రా! ఇంతవఱకు నేను నీకు వినీతుఁడుగ నుంటిని. ఈవినయమునకు నీ వనర్హుఁడవని నాకిప్పుడు గోచరించినది. నీవును, నీ సహోదరపుత్రుఁడును హీనబుద్ధులు. మీ యోగ్యత యెంత? మీరు తృణముకంటె హీనముగ నాకు కనఁబడుచున్నారు. నీ మిత్రిత్వమును బరిశీలించి మాధవుని పత్రమును నిదివఱకుఁ బ్రకటింపనైతిని నీసత్కారమునకు నే నెప్పుడును కృతజ్ఞుఁడను. దీనికిఁగాను నీవు నావలనఁ బొందవలసిన దేదియైన నున్నయెడల నీయుత్తరువును నెఱవేర్చెదను. నీవిప్పుడునాకుఁ జేసిన యవమానము దుస్సహమైనది. కావున నేఁకనొక్క నిమిషముకూడ నీయింట నుండను. మాధవుని పత్రిమును నాచరణలోనికిఁ దెచ్చు విషయములో నీ వాగ్దాన ప్రకారము సహాయము చేయుదువేని చేయుము; చేయవేనిని, సర్కారుమూలకముగ నడిపింప

వలసిన కార్యములను నడపించెదను. ఈపట్టణములోని కల్పతరువను వంటపూటియింట నుండెదను. ఆవశ్యకమైన, నీవు నన్నచ్చటఁ జూడ నగును.

పరంతపుఁ డిట్లు పలికి, యతని సాన్నిధ్యమును త్యజించి, లేచి పోయెను. సుమిత్రుఁడు మహోత్సవసమయమున కామమోహిన్యంతర్ధానదుఃఖావమానములను సహింపలేక, కొంతతడవు కర్తవ్యకార్యముల నెఱుఁగక యుండి, పిదప నతిథులను భోజనతాంబూల పరిమానహార ములతో నుపచరించి, యనంతరము శుభకార్యభంగకారణమును సంగ్రహముగఁ దెలిపి వారినిఁ బంపివేసెను. అందఱును విస్మితులై, 'అనను రూపమగు ఘటనను జేయవలెనని మనుష్యుఁడు యోజించినయెడల, సర్వశక్తుఁడు విఘ్నముచేయుట కలదని యిప్పుడు వ్యక్తమైనది.' అని చెప్పుకొనుచు వెడలిపోయిరి.

---

## అధ్యాయము. 6.

—)o(—

పరంతపుఁడు కల్పతరువునకుఁ బోయి, తనకనుకూల మగుగదిని బాడుగకుఁ దీసికొని, దానిలోఁ దన సామగ్రిల నుంచి, గదికి తాళము వేసి, యార్యకీర్తి కుటీరమునకు వెడలెను. అచ్చట బహిఃద్వారమును తట్టినతోడనే యొకవృద్ధాంగన కవాటబంధమును సడల్చెను. కామ మోహినివృత్తాంతమును బ్రశ్నింపఁగా, నామె గృహాంతర్భాగమునకుఁ బరంతపునిఁ బిలిచికొనిపోయెను. అచ్చోట నార్యకీర్తియు, నామె మాతాపితరులును, కామమోహినియు సంభాషించుచుండిరి. పరంతప దర్శనమునఁ గామమోహిని చటాలున లేచి, యతనికి స్వాగత మిచ్చి యతనిని, తన ప్రియసకిని, సత్యవతీసత్యశర్మలకును నెఱింగించెను.

సత్యశర్మ—అయ్యా, కామమోహిని నా సుతకుఁ బరమాప్తురాలు. కాఁబట్టి, యీమెయు నాకొమార్తె. ఈమె తన పెంపుడు

తండ్రి యేర్పాటుచేసిన శంబరుని నివాహమాడనని సుమిత్రి పోషణను ద్యజించి, యిచ్చటికి వచ్చియున్నది. ఈమె వర్ణనలవలన మీగుణగణములను విని సంతసించు చుంటిమి. సుగుణనిధి వగు నీయొక్క దర్శన లాభముచే నధిక సంతుష్టులమైతిమి. ఈ కామమోహిని యనాథ. ఇంతవఱకు సుమిత్రుఁ డీపెను పితృప్రాయుఁడుగ నుండెను. దుష్టుఁడగు శంబరున కీమె నిచ్చి యుద్వాహము జరుపవలెననెడి కాంక్షతో నొనర్చిన మహోత్సవ సమయమున మాధవునినిర్యాణము విఘ్నముగ బరిణమించెను. దీనిని లక్ష్యపెట్టక పునఃప్రయత్నముచేయఁగా, నతని యధీనములోనున్న స్త్రీరత్నము తొలఁగుటయేకాక యతఁడు జనాపవాదమునకు గుఱి యయ్యెను.

వ—సత్యశర్మా! నీసౌజన్య మసామాన్యమైనది. దైవవ్యాపారము విచిత్రము. సుమిత్రుఁ డీమెను శంబరునకిచ్చి పరిణయము జరపు విషయమునందు నా సాహాయ్యము వేఁడెను. నేను తోడ్పడుట కుద్యుక్తుఁడ నైతిని. అనంతరము శంబరుని దుష్ట కార్యదుర్గుణము లీమె వలన విన్నది మొదలు సుమిత్రుని ప్రయత్నమునకు తోడ్పడుట యధర్మమని మనస్సునకుఁ దోఁచినది. ఈపెను నేనే యపహరించితినని సుమిత్రుఁడు నామీఁద నేరమును మోపినందున నేనతని మందిరమును వదలి, కల్పతరువుచ వాసము చేయుచున్నాను. ప్రస్తుత మీామె యవస్థ యధిక శోచనీయముగనున్నది. మీరీమెను ప్రస్తుతము పోషించుచున్నయెడల సర్వేశ్వరుఁడు మీకు శుభము లొసఁగును. నాచేతనగు ప్రత్యుపకారమును నే నొనర్చెదను.

సత్యశర్మ—చాలకాలమునుండి మే మామెవలన లాభమును బొందుచునే యున్నాము. ఈమె రూపయౌవనము లందును, విద్యావైదుష్యములందును నసాధారణురాలగు కన్య. ఇట్టి యమూల్యరత్నమును పేదవారగు మాబోంట్ల యాశ్రయమునం దుంచుటకంటె

నన్నివిధముల ననురూపులగు మీ రీమె నతిత్వరితముగ నుద్వాహము చేసికొని, యనాథను సనాథగా చేయవలసిన దని ప్రార్థించు చున్నాను.

ప—మీ ప్రార్థనను నేను నిరాకరించుటకు సాహసింపను. అయినను, వివాహోచితసందర్భములును నుద్వాహకాలమును నింకను రాలేదు. దీనికి వలయునేర్పాటుల నొనర్చిన పిదప నీ కార్యమును నె అవేర్పవలసి యున్నది.

సత్యశర్మ—మాధవుని సర్వస్వము మీకు దత్తముగ వ్రాయఁ బడి యున్నదను వదంతికలదు. ఇది సత్యమేనా?

ప—నిజమే. అతని భవన మఠాదుల నెల్లను వశపఱుచు కొనిన పిమ్మట వివాహమాడుటకు సంసిద్ధుఁడనై యుందును.

సత్యశర్మ—మాధవునియాస్తి యపారమైనది. అతని మందిర మొక రాజసదనమును బోలినది, అయినను, అదియపేక్షణీయమైనది కాదు. దానిని బొందినవారు క్షేమముగను, సౌఖ్యముగను నుండుట దుస్సాధము. నాయనభవనములో నీయాస్తిని బొందిన వారందఱు పెక్కుసంకటములకుఁ బాలైరి. అట్టి ప్రమాదములు మీకు రాకుండ నుండుఁగాక యని పరాత్పరుని ప్రార్థించుచున్నాను.

ప—మాధవుని గృహారామ విషయములందు మీ వలెనే యనేకులు పెక్కువిధములగు కథలను చెప్పుదురు. వీనిని మీనోటి గుండా విశదముగ వినవలెనని కుతూహలపడుచున్నాను.

సత్యశర్మ—మాధవుని గృహ మిచ్చటినుండి రెండుమైళ్ళదూర మున నున్న పర్వతావృతమైన శిలాసౌధము. దీనిని బూర్వకాల మొక ప్రబలుఁడగు చోరుఁడు కట్టించెనని వదంతి కలదు. ఈహర్మ్యము చుట్టును నధిక ఫలవంత మగుభూమిగలదు. ఈసౌధము చాలయంత స్తులు గలది. చుట్టుప్రక్కలనున్న కొండలను, వానిలో నివసించు

దుష్టమృగములను జూచినయెడల, నగరవాసు లగు జనులకు నత్యంత భయోత్పాతకముగ నుండును. ఈ ప్రాసాదములో ననేకములైన సొరంగములు గలవు. వానిలోఁ బ్రవేశించినవా రవి పిశాచనివాసస్థానములనియు మధ్యాహ్న వేళలందుఁగూడ నచ్చట భూతధ్వనులు వినఁబడుననియు, నవి యొక స్థలమునందలి మనుష్యులను స్థలాంతరములకుఁగొని పోవుననియు, నవియరుదుగఁ గొందఱికి దృష్టిగోచరములగుననియు, వానిలోఁ గొన్ని మనుష్యముఖవ్యాఘ్రములుగను, కొన్ని వ్యాఘ్రముఖమానవులుగను, మఱికొన్ని భల్లూక వానర వక్త్రంబులుగలిగి మానవగాత్రధారులుగ నుండు ననియు, వానిని దర్శింప పెక్కండ్రు వెఱపును జెంది, జ్వరాదులచే గతించిరనియు, వచింతురు. ఇది యథార్థముగ నుండనోవు. ప్రథమమున నీసౌధమును గట్టించిన ధూర్తుఁ డధిక దుర్మార్గుఁ డనియు, ననేకలక్షల జనులను బలాత్కారముగఁ బట్టుకొని, తన హర్మ్యమునకుఁ దెచ్చి, వారి సర్వస్వమును నపహరించి, వారిని వధించి సమీపభూములందుఁ బూడ్చెననియు, నిట్లు మృత్యువు వాత పడినవారు పిశాచరూపమున నిచ్చట నివసించుచున్నారనియు చెప్పుదురు. ఇంతేకాక, యీ ప్రాసాదముయొక్క రత్నాకర మను నభిధానము అన్వర్థనామధేయ మని భావించుచున్నాను. చుట్టు ప్రక్కలనున్న కొండలలో సువర్ణఖను లనేకములున్నవి. ఈభవనమున కడుగున పెక్కురత్నపు గనులు గలవు. ఈయమూల్యపదార్థముల కొఱకు త్రవ్విన సొరంగములు కొన్ని కలవనియు, నప్పు డప్పుడు మాధవుఁడు వజ్రముల నమ్ముచుండెననియుఁ జెప్పుదురు. ఈ యాస్తి యంతయు నీ స్వాధీనమైనందులకు సంతోషమే కాని, కొన్ని విధముల మాకు భయావహముగ నున్నది.

ప—మానవవదనములుగల శార్దూలములను, భల్లూకములను మీరు చూచియుంటిరా?

సత్యశర్మ—నే నొకపర్యాయము రత్నాకరమునకుఁ బోయి యుంటిని. వానిని దర్శించినతోడనే నాకు ప్రజ్ఞ తప్పిపోయెను. దైవ వశమువలన నాసుహృదులు కొందఱు నన్నీదుర్గమునుండి బయటికిఁ దెచ్చిరి.

ఇట్లు మాటలాడుచుండులోపల సత్యవత్యార్యకీర్తులు వేఱు గదిలోఁ బ్రవేశించి,వివాహోచితవస్త్రభూషణములను కామమోహినిచే ధరింపఁజేసి, పురోహితునిఁ బిలిచి, మంగళద్రవ్యములను సిద్ధపఱిచి సత్యశర్మకుఁ దెలిపిరి.

సత్యశర్మ—ఆర్యా! సత్యాదులీదినమున నిన్ను కామమోహిని కిచ్చి పరిణయోత్సవమును నెఱవేర్పవలెనని సిద్ధముగ నున్నవారు. మీ యభిప్రాయమేమి ?

ప—ఇది యసాధ్యము. బంధుమిత్రు లెవ్వరునులేక నేనిచ్చటకు వచ్చియున్నాను. నివాసగృహములేదు. వలసిన సామగ్రిలు లేవు. శత్రువుల మధ్య నున్నాను. మీతొందర సరికాదు.

సత్యశర్మ—వివాహమున కివి యన్నియు ననావశ్యకములు. సంకల్పమే ప్రధానము. కామమోహిని దైవప్రేరణచే మిమ్ము వరించు చున్నది. వివాహము చేసికొననిచో నామె యవివాహితయని పర పరిగ్రహణావకాశముండును. ఒకవేళ శంబరుఁ డీమెనుబలాత్కారముగ వివాహము చేసికొనవచ్చును. ఈమె మిమ్ములను వివాహ మాడినది యని తెలిసినయెడల, ఆతఁ డీరీతిని ప్రవర్తించుటకుఁ బ్రతిబంధక మగును.

ప—మీరు వచించిన దంతయు సత్యమే యైనను నీసమయము వివాహోచితమైనది కాదు.

ఇట్లు సంభాషించుచుండఁగా, సత్యవతి యచ్చటకువచ్చి, ఓయి పరంతపుఁడా! మీరు విద్వాంసులు, పూర్వాపరజ్ఞులు, ఊహాపోహలను

దెలియనివారు కారు. మా వాక్యములను మీరుల్లంఘించిన పక్షమున కామమోహిని శంబరుని పాలగును. తోడనే యామె యమసదనము నకుఁ బోవుననుటకు సందియములేదు. ఈ యనర్థములకు మీరు కారకు లగుదురు. సుమిత్రశంబరు లీమెను వెదకుటకు వేగుల నిదివఱకే పంపియున్నారు. వారు రేపో, మఱునాఁడో, యీమెను కనుఁగొందురు. వివాహము జరిగినచో నెట్టి భయముండదు. మా మాటలను నిరాక రింపవలదు. మంగళస్నానమునకు లెమ్ము.

ఆర్యకీర్తి—ఆర్యవర్యా! నాతల్లిపలుకు నాకర్ణింపుఁడు. ఈయ నాథ యగు సఖికి నాథులరగుఁడు. నాప్రియమిత్రురాలను విడిచి నేనుండఁ జాలను; నన్ను వదలి నా తలిదండ్రు లుండరు; దయచేసి స్నానమునకు లెమ్ము.

ప—(స్వగతము) ఆర్యకీర్తియు, నామెమాతాపితరులును చెప్పిన సంగతు లన్నియు నిజమే. సుమిత్రశంబరులు ప్రబలులును, ధనికులును. శంబరుఁ డీమెను బలాత్కారముగఁ బరిణయము చేసికొనినయెడల నీపె యాత్మహత్య చేసికొనును. ఈపాపకృత్యమునకు నేనే హేతు వగుదును. అప్రార్థితముగ నన్ను ధర్మపత్నిగాఁ గైకొనుమని ప్రార్థించు బాలను నిరాకరించుట యధర్మము. మఱియు, నార్యకీర్త్యాదు లీ ప్రార్థన నామోదించుచున్నవారు. వృద్ధులగు సత్యశర్మల కోరికలనుల్లం ఘించుట యనుచితము. భావికష్టముల నన్నిటి ననుభవింపక తీఱదు. నేను సత్యవంతుఁడనైనచో నీశ్వరుఁడే నన్ను రక్షింపఁ గలఁడు. ఆసర్వ కర్త మీఁదనే భారమును మోపి, వీరి యిష్టానుసారముగ నడచుకొనె దను. అనిమనస్సులో దృఢపఱుచుకొని, సత్యవత్యాదులతో 'ఓసత్య వతీ సత్యశర్మాదులారా! మీ ప్రార్థనలను నిరాకరించుటకు నాకు మనస్సు రాకున్నది. ఈ వివాహానంతరము కలుగు నాపదలను సర్వేశ్వ రుఁడే తొలఁగింపవలెను.'

'వారు ముప్పురును, ధర్మప్రవృత్తులకు సంభవించు సంకటములను నిర్మూలించుటకు నీశ్వరుఁడు కృతసంకల్పుఁడై యుండును' అని పరంతపునితోఁ జెప్పి, కామమోహినీపరంతపులకు మంగళస్నానములను జేయించి, బ్రాహ్మణులను ముత్తైదువల ననేకులను బిలిచి, మంగళతూర్యపురస్సరముగ సమీపదేవస్థానమునకు వెడలి వివాహమహోత్సవమును జరిపిరి. వధూవరు లిద్దఱును, విప్రసువాసినులెదుట నగ్నిసాక్షిగ, దేవసాన్నిధ్యమున ధర్మార్థకామవిషయములం దతిచరించి ప్రవర్తింప మని ప్రతిజ్ఞలను జేసిరి. కామమోహినీపరంతపులకు నిర్విఘ్నముగ నుద్వాహోత్సవము ముగిసెను.

---

## అధ్యాయము. 7.

—(౦)—

పరంతపుఁడు సుమిత్రగృహమునుండి వెడలినతోడనె సుమిత్రుఁడు స్వల్పకాలము కర్తవ్యమును యోజించి, కామమోహినియొక్క యన్వేషణమునకుఁ గొందఱను నియమించి, శంబరుని సమీపించెను. అప్పు డతఁ డత్యంత వ్యాకులచిత్తుఁడై యుండెను.

సు—శంబరా! నీ సంతాపమును జూడఁగా నా కధికవ్యసనము కలుగుచున్నది. కామమోహిని ప్రథమమునుండియు నీయందనురక్తురాలు గాదు. ఆమెయెడల నీకుఁ గల యభిమానము నాలోచించి మీ యిరువురకును సంబంధము కూర్పవలెనని చాల ప్రయత్నపడితిని. అంతయు నిష్ఫల మయ్యెను.

శం—ఎప్పుడును నిష్ఫలము గాదు. పరంతపునిఁజూచి, యామె నన్నుఁ దిరస్కరించినది. అతనిని బట్టుకొని, కారాగృహస్థునిగాఁ జేసెదను. అట్లు కానిచో యమపురికిఁ బంపెదను. తోడనే కామమోహిని వినీతురా లగును.

సు—ఇది యసాధ్యము. పరంతపుఁడు సామాన్యుఁడు కాఁడు. అతని బుద్ధిశక్తు లసాధారణము లైనవి. అతని గుణాతిశయములును నట్టివే. అతనిని దర్శించిన వారును, నతనితో సంభాషించిన వారును, నతనియందు విశ్వాసయుతు లగుదురు. అతనిని ప్రతిరోధించిన యెడల మనగతి యెట్లుండునో తెలియదు.

శం—ఏరికిఁ దెలియకక యతనిని బంధించి, చెఱసాలలో నుంచి, మరణపర్యంతము విడువను.

సు—నీవు లోకవ్యవహారజ్ఞానశూన్యుఁడవు. ప్రపంచములో మన మొకవిధముగ యోజించినపక్షమున నది నెఱవేఱకుండు రీతిని సర్వేశ్వరుఁడు పర్యాలోచనము చేయఁగలఁడు. తుదకు 'యతో ధర్మ స్తతో జయః' అనునట్లు ధర్మపక్షము విజయమునుబొందును. మనము పాతకఫలము ననుభవింతు మని గ్రహించుచు, నధర్మమునఁ బ్రవర్తింప వచ్చునా?

శం—కార్యసాధన ప్రవర్తకు లగువా రీబుద్ధిజాడ్యజనితో న్మాదోక్తులకుఁ జెవి యిచ్చినచో నేకార్యమునుగాని సాంధింపఁ జాలరు. నీ ధర్మోపదేశములు ద్వాపరయుగార్హములు. వాని ప్రకారము నడవక, నాయిచ్చవచ్చినట్లు నేను ప్రవర్తించెదను.

సు—ఏకార్యమును జేయఁ దలఁచినను భావిపరిణామమును యోజింపవలెను. అట్లు కానియెడల ననర్థము లనేకములు వాటిల్లును. ఈపరంతపుఁడు దుష్టనిగ్రహ శక్తుఁడు. మాధవుఁడు పుత్రవాత్సల్యముతో వ్రాసిన పత్రము ప్రకారమాస్తి నంతటిని స్వాధీనపఱచుటకు పరంతపుఁ డిచ్చటికి వచ్చియున్నవాఁడు. అతఁడు నిదురించు కాలమునం దతని చేతిపెట్టెను వేఱుతాళపుచెవితోఁ దెఱవఁగా నొక సర్కారు మొహరు గల కాగిత మగుపడినది. అతఁడు దుష్టనిగ్రహ విషయము నందు ప్రభుత్వమువారివలన సర్వాధికారమును బొందియున్న ట్లా

కాగితము వలన విశద మగుచున్నది. ఇట్టివానినిఁ జెనకుట శ్రేయస్కరము కాదు.

ఈ మాటలు వినఁగానే శంబరుఁడు చింతావరవశుఁడై, సుమిత్రునిఁ జూచి, 'అయ్యో! అన్నివిధములను నేను చెడినవాఁడను. మాధవునికి హక్కుదారుఁడ ననియు, నతని యైశ్వర్యమంతయు నాకుఁ దక్కుననియుఁ దలఁచితిని. అది పరాధీనమైనది. కామమోహినినైనఁ జేపట్టుదునని భావించితిని. ఆమెయు పరవశయైనది. నా కిఁక జీవితేచ్ఛలేదు. ఈక్షణమే పరంతపుని వధించి, మాధవుని యైశ్వర్యమును, కామమోహినిని, బొందు ప్రయత్నము చేసెదను. కానియెడల నీ యుద్యోగమునందే నాయువును ద్యజించెదను' అనెను.

సు—పుత్రుఁడా! దుడుకుతనము వలదు. మాధవుని యాస్తి పోనిమ్ము. కామమోహిని పోనిమ్ము. నాకు మగపిల్లలు లేరు. నాసర్వస్వమునకు నీవు బాధ్యుఁడవుగ నుండుము, నామేనగోడలికి నీయందను రాగ ముదయించునట్లు చేసెదను. నాయాస్తి నామె పేరట వ్రాసితిని. ఆమెను బరిగ్రహించి, సుఖజీవయాత్ర చేయుము. ప్రబలులతో విరోధపడకుము.

శం—నాతండ్రియు నతని సహోదరులగు మీ రిరువురును నాయందు మిత్రభావముఁ జూపరైతిరి. మాధవుఁడు తనయాస్తిని నజ్ఞాతకులగోత్రున కొప్పగించెను. నీ సర్వస్వమును నీవు కళావతికి వ్రాసి యిచ్చితివి. నాతండ్రియో, నా కన్నవస్త్రములకు గతిలేకుండునట్లు తనసొత్తును ద్యూతాది సప్తవ్యసనములందు వ్యయపఱిచి, యకాలమరణమును బొంది, నాపాలిటి శత్రువుగ పరిణమించెను. మీవంశమున కేకపుత్రుఁడైన నాకీరీతిని నిగ్గతియైనది. కళావతిమీఁద నాకుఁ బ్రేమలేదు. నీద్రవ్యము నా కక్కఱలేదు. నా మనస్సునకుఁ దోఁచినట్లు నేను నడచుకొనెదను.

సు—ఓ శంబరా! మాధవునియాస్తి నీకుఁ జేరదు. నీవు కళావతిని వివాహమాడు పక్షమున నాపత్రమును రద్దుపఱిచి, సిన్నే నాయాస్తికి బాధ్యునిగఁ జేసెదను. చక్కఁగ నాలోచించుకొనుము.

శం—నేను పరంతపునికి వైరశుద్ధిచేయుట మానువాఁడనుగాను. ఱేపే యతనిని గలహమునకుఁ బిలిచి, యతనితోఁ బోరాడెదను. (పూర్వకాలమున వాది ప్రతివాదులందు న్యాయస్థు లెవరో కనుఁగొనుటకు నిరువురును పంచాయతి యెదుట ద్వంద్వయుద్ధము చేయఁగా దానిలో విజయపక్షము న్యాయ్యమనియు, పరాజితుని పక్షము ధర్మబాహ్యమనియు నిర్ణయింపఁబడుచుండెడిది.)

సు—ఇది సాపాయము. నీవు బలిష్ఠుఁడవైనను, నతఁడు నీకజేయుఁ డయినను, నతని నోడింపఁగలవని యనుకొందుము. నీ వెట్లతని నోడింప నెంచియున్నావు?

శం—పిస్తోలుతోఁ గాల్చి చంపివేయుదును.

సు—పిస్తోలుపయోగమున నీ వతని కంటె సమర్థుఁడవో?

శం—ఈ విషయమున నా కెవ్వరు నెదురుండరు.

సు—పరంతపుఁడు సర్కారునుండి పొందిన యధికారపత్రమునుగుఱించి యిదివఱకే నీకుఁ జెప్పియుంటిని. నానావిధాయుధోపయోగమున నద్వితీయ పాండిత్యము లేనిదే యిట్టి పత్రము నెవ్వఁడు గాని పొందియుండఁడు.

శం—అతని కిచ్చిన యధికారపత్రముకంటె వేయి మడుగుల యధికారము నాకుఁ గాలక్రమమున రాఁగలదు.

సు—ఈమాటలు నిష్ప్రయోజనములు. కామమోహానికి నీయందనురాగము సున్న. మాధవునియాస్తికి నీకు హక్కులేదు. కాఁబట్టి పరంతపుని ధర్మపరత యతనిని గాపాడకుండునా? నీ వెంత బలిష్ఠుఁడవైనను నీ యధర్మము నిన్ను చెఱుపదా?

శం—కానిమ్ము. కార్యముచే నాసామర్థ్యమును జూపెదను.

సు—అట్లయిన నీ యిచ్ఛవచ్చినట్లు చేయుము. నేను కళావతికి వ్రాసియిచ్చిన పత్రికను స్థిరపఱిచెదను. (అని పలికి వెడలిపోయెను.)

---

## అ ధ్యా య ము. 8.

——)o(——

తన వివాహానంతరము పరంతపుఁడు భావికార్యనిర్వహణార్థము సాయంతనమునఁ గల్పతరువును జేరునప్పటికి శంబరుని సేవకుఁ డొక జాబును దెచ్చి యిచ్చెను. దానిలో నిట్లు వ్రాయఁబడి యుండెను.

పరంతపుని సన్నిధికి:—

శంబరుని విజ్ఞాపన. మాధవుని యవసాన కాలమునందు నీవతని చేతిపెట్టె మొదలగు వానిని వశముచేసికొని కృత్రిమమగు నొకపత్రికను సృష్టించి, యతని సర్వస్వమును స్వాధీనపఱచుకొనుట కిచ్చుటకి వచ్చుటయేకాక, నాయందుఁ బూర్ణానురాగము గల యువతికి దుర్బోధచేసి, మాయిరువురి వివాహమునకు విఘ్నము తెచ్చితివి. ఈ తప్పిదమును నీ వొప్పుకొనుచో, మాధవుని సొత్తును, నతని పత్రమును, నా సుందరినిఁ దెచ్చి యొప్పగించి, శరణాగతుఁడ వగుము. అట్లు కానిపక్షమున ఱేపు ప్రాతఃకాల మెనిమిది ఘంటలకు నీ పంచాయితితో నాయుధపాణివై యూరివెలుపల నుండు నుద్యానవనమునకు రాఁగోరెదను. ఆపోరునందలి జయాపజయములే మనయిద్దఱి న్యాయాన్యాయములను నిరూపించునుగాక! ఈవిషయమును నేను మనఃపూర్వకముగ నొప్పుకొని యీలేఖను వ్రాసియున్నాను.

ఇట్లు,
శంబరుఁడు.

పై జాబును జదివి పరంతపుఁడీ ప్రత్యుత్తర మంపెను
శంబరుని సన్నిధికి:—

పరంతపుని విజ్ఞాపన. నీయుత్తరమును జదివితిని. దానిలో నీవు నామీఁదఁ దెచ్చిన నేరము లన్నియు నసత్యములు. నీజాబులో వ్రాసినట్లు నిర్ణీతస్థలమునకు నేను సిద్ధముగ వచ్చెదను. నీవును నీ పంచాయతీతో సిద్ధపడి రమ్ము. మన యిద్దఱి న్యాయాన్యాయములను నీ యుద్ధమే ప్రచుర పఱచును.

పరంతపుఁడు.

పై నిర్ణయము ననుసరించి శంబరపరంతపు లిద్దఱును వారివారి పంచాయితులతో నుద్యానవనమునకు వచ్చి చేరిరి. ఆ పట్టణ ప్రభువగు సమరసింహుఁడు గూడ వచ్చియుండెను. ఇరుపక్షముల వారు నతని నధ్యక్షునిగ నెన్నుకొనిరి. ఇద్దఱి పిస్తోలులలోను నొక్కొక్కగుండు మాత్ర ముంచునట్లును, నొకసారి కాల్చిన తర్వాత జయాపజయములు తేలని యెడల పంచాయతీదారుల యనుమతిని బొంది రెండవ యావృత్తి ప్రయోగింపవలసిన దనియు నిర్ణయింపఁబడెను. తోడనే యిరువురును మధ్యను ముప్పదియడుగుల యంతరమును వదలి నిలుచుండిరి. అధ్యక్షుఁడు యుద్ధనియమములను జదివిన పిమ్మట శంబరపరంతపులు వారియంగీకారమును దెలిపిరి. అప్పుడు సమరసింహుఁడు సిద్ధముగ నుండుఁడు,—ఒకటి,—రెండు,—మూఁడు అని హెచ్చరించెను. తత్క్షణమే రెండుపిస్తోళ్ళును ప్రయోగింపఁబడెను. శంబరుఁడు గాల్చిన గుండు గుఱితప్పి, సుమిత్రునికిఁ దగిలి యతఁడు నిహతుఁడై నేలమీఁదఁ బడెను. పరంతపుని గుండు శంబరుని దక్షిణభుజమును దాఁకి యతఁడు భూమిమీఁద నొఱగెను. తోడనే పంచాయతీ దారులలోని వైద్యుఁడు శంబరునికిఁ దగిలిన దెబ్బను పరీక్షించి ప్రాణ

హాని లేదనియుఁ, జికిత్సచే రెండుమూఁడు దినములలో స్వస్థత గలుగు ననియుఁ దెలిపెను. అప్పుడు పంచాయతీవారు శంబరునితో "నీవు దెబ్బలవలన మృతినొంది యున్న యెడల పరంతపుఁడు నిర్దోషియనియప్పుడే తీర్మానించి యుందుము. ఇప్పుడునుసట్టితీర్పు చెప్పుటకు మాకశఖ్యాంతరము లేదు. ఐనను, నీయభిప్రాయమును సూచింపుము." అనిరి.

శం—ఈ పోరువలన న్యాయ నిర్ణయము కాలేదు, కలియుగమగు నీ కాలమునందు విపరీతస్థితు లుండుటంజేసి, పాపశీలురు నుత్తమ పదవియు, సుకృతులకు నధోగతులును కలుగుట నైజ విషయమే. కర్తవ్యమేమి?

స—న్యాయనిరూపణమునకు నీ యాహవమును నియమించినది నీవే. దీనివలన నిరాక్షేపముగ ధర్మవ్యవస్థకలుగునని నిష్కర్ష చేసినదియు నీవే. ఇట్టి సంగ్రామమువలన ధర్మాధర్మములకు గుర్తెఱుఁగుట దుస్సాధమని నీవిప్పుడు హెచ్చరించుట కడు వింతగ నున్నది. ఇట్టి యసందర్భపు ప్రలాపముల కెవరు ప్రత్యుత్తర మీయఁగలరు? నీశత్రుభంగార్థ ప్రయోగమైనగుండు నీపక్షస్థుఁడైన సుమిత్రుని మృతికిఁ గారణ మైనందున నీ యధర్మము విస్పష్టము కాలేదా? అది యటుండ నిమ్ము. సుమిత్ర నిహన నాపరాధమున కెవరు బాధ్యులో తెలియఁ జేయుము.

శం—విగ్రహనిర్ణయానుసారముగ పంచాయితీదారులు చేయు తీర్మానముల కేయాక్షేపణయు లేదు. సుమిత్రమారణమునకై మనః పూర్వకముగ నేనేమియుఁ జేయలేదు. కావున నితని దిష్టాంతమునకు నేను బాధ్యుఁడను గాను.

పం—ఈ పరీక్షచర్చతో మాకుఁ బనిలేదు. శంబరుఁడా! నీవు పరంతపుని మీఁదఁ దెచ్చిన యపరాధములకు క్షమాపణ కోరుము.

శం—మీయాజ్ఞను శిరసావహించి, మీరు వచించినట్లు

చేసెదను. పరంతపుఁడా! నా దుర్బుద్ధికి నేను సంతాపపడుచున్నాను. నా యపరాధములను క్షమింపుము.

ప—శంబరుఁడా! అపకారము ననుభవించిన వారికంటె నపకార మొనర్చినవారికి ద్వేషము దీర్ఘకాలముండుట లోకస్వభావము. ఇట్లుండ, నీవే ద్వేషమును విడనాడి శాంతమూర్తి వగునపుడు నేను మనఃకాలుష్యమును విడుచుట కష్టము కాదు. నీప్రార్థనలవలన నేను మిగుల సంతోషించితిని. స్నేహమువలనఁ గలుగు లాభములు ద్వేషమువలనఁ గలుగవు. ఈయుద్ధమువలన నీకుఁ గలిగిన నష్టములను జూచి నేను చింతాక్రాంతుఁడ నైతిని. మాధవుని యాస్తికి నే నాశించితినని తలంపవలదు; మాధవుని పత్రమున నతని సొత్తు విని యోగపడు విధము తెలియనగును. ఆపత్రము ప్రకారము నాకు రావలసిన సొమ్మును నీకొప్పగించెదను. నీవునీ పెద్దతండ్రి యగుసుమిత్రుని యాస్తిని వశపఱుచుకొని, కళావతిని వివాహమాడి యామెతో సుఖముగ బ్రదుకుము. ఇఁక నేను పోయివచ్చెదను.

శం—ఆర్యా! నమస్కారము. మీరు చెప్పినవిషయమును గుఱించి యాలోచన చేసెదను. (అని పలికి పంచాయితీదారుల సాహాయ్యముతో గృహమునకు వెడలెను. పరంతపుఁడు కల్పతరువున కేగెను.)

---

## అధ్యాయము. 9.

—)०(—

మఱునాఁడరుణోదయకాలమునఁ బరంతపుఁడు సుమిత్రగృహోపవనమును నేకాంతముగఁ బ్రవేశించి, తా నచ్చటఁ బూడ్చియుంచిన పేటికను దీసికొనుపోవు సమయమున కళావతి యెదురయ్యెను.

క—అయ్యా! మీ రింతవేళవ నిచ్చటికి వచ్చుటకుఁ గారణ మేమి? ఈ పెట్టెలో నేమున్నది?

ప—ఇది నాచేతిపెట్టె. దీనిని నామిత్రుఁడొకని దగ్గఱకుఁ దీసి కొని పోవలసియున్నది.

క—మాయింటిని విడిచిపోవుటకుఁ గారణమేమి?

ప—ఏమియు లేదు. దుర్బోధచేసి, కామమోహినిని స్వాధీన పఱచుకొంటి నని నీమాతులుఁడు నామీఁద దోషారోపణ చేసెను. దీనివలన నాకు విషాదముకలిగి, నివాసాంతరమునకు వెడలిపోతిని.

క—ఇప్పుడు కామమోహిని యెక్కడ నున్నది?

ప—నాకుఁ దెలియునుగాని నే నిప్పుడు చెప్పుటకు వీలులేదు.

క—అనురూపుఁడగు పతినిఁ జేరి యామె సుఖముగ నుండుట యే నాముఖ్యాశయము.

ప—ఇట్లు నీవు చెప్పుటకుఁ గారణమేమి?

క—వేఱుకారణ మేదికావలెను. శంబరునిమీఁద నామెకు స్వల్పానురాగము కూడ లేదు

ప—అయిన, శంబరుఁడు నీకిష్టుఁడా?

క—నాకుఁ బ్రియుఁడే. నామామ యతని ననేక పర్యాయ ములు స్తుతించి యుండెను.

ప—నీవు సర్వప్రయత్నములవలనను శంబరునికి నీమీఁద ననురాగ ముండునట్లు చేసికొనుము. కామమోహిని నీప్రయత్నమున కెప్పుడుగాని యడ్డురాదు.

క—అట్లయిన, మీయిద్దఱి సహాయమువలననే యీకార్యము నెఱవేఱవలెను. మీరే కామమోహినికిఁ దగిన భర్త. మీయిద్దఱి యుద్వాహమునకు నాచేతనగు తోడ్పాటును నేను చేసెదను

ప — నీవు మాయందుంచిన ప్రీతికై మేము కృతజ్ఞులము. నాకును కామమోహినికిని వివాహము జరిగినది. మే మిద్దఱము నీవివాహము నకు సహాయము చేయుటకు సిద్ధముగ నున్నాము. అయినను, నీ వెట్టి క్లేశము సంభవించినను ధైర్యమును విడనాడకుము. పొమ్ము. నిన్నుఁ దిరిగి కలసికొందును. అని చెప్పి పరంతపుఁడు కల్పతరువునకుఁ బోయెను. అచ్చట నర్థపరుఁడు వేచియుండెను.

ప — మీ రెప్పుడు వచ్చితిరి?

అ — ఇప్పుడే వచ్చితిని. నాతో నేదైన పనియున్నచో దానిని చేయుటకు సంసిద్ధుఁడను.

ప — మాధవుని పత్రమును రిజిష్టరుచేయుటకు మీరు నాతో రాఁగలరా? ఆకార్యసమాప్త్యనంతరము రత్నాకరమున కేగి, దానినిఁ బరిశోధింపవలెనని యున్నాను.

అ — మీరొంటరిగా వెళ్ళుదురా?

ప — మీరుకూడ వచ్చునెడల సంతోషము.

అ — రత్నాకరము విషయమున నేనును చిత్రవిచిత్ర కథలను వినియుంటిని. దానిని ప్రత్యక్షముగ నవలోకించి రావలెనని కుతూహల పడుచున్నాను.

ప — మంచిది. మనమిద్దఱము పోవుదము.

ఇట్లు నిశ్చయించుకొని, వారిరువురును రిజిస్ట్రార్ ఆఫీసుకువెళ్ళిరి. అచ్చట నున్న యుద్యోగస్థున కాపత్రము నిచ్చి, దాని పూర్వాపరములను దెలిపి, యచ్చటి గుమస్తా రానందున పత్రమును దీసికొనుటకు మఱునాఁడు వచ్చెదమని చెప్పిరి. అర్థపరుఁడు సాయంతనమునకుఁ బూర్వము పరంతపుని కల్పతరువు నొద్ద కలసికొందునని మాటయిచ్చి, పురదర్శన కుతూహలుఁడై వెడలెను. పరంతపుఁడు కల్పతరువునకుఁ బోయెను.

మార్గములో సర్ధపరుఁడు శంబరున కెదురయ్యెను. అప్పుడు

శం—ఓహో మిత్రుఁడా! సమయమునకు వచ్చితివి.

అ—ఏమిది? నీవు నీ దక్షిణభుజమున కెందులకు కట్టు కట్టుకొని యున్నావు?

శం—పాపియగు పరంతపునితో నేను యుద్ధము చేయవలెనని యుండిన సంగతి నీకుఁ దెలియును గదా? ఇది దానిఫలము.

అ—అయ్యో! పాపము! మీయుద్ధములో నతనికిఁగూడ నపాయము కలిగినదా?

శం—అతనికి దైవానుకూల్య ముండెను. నేను గాయపడుటయే కాక పరంతపుని నుద్దేశించి వేసినగుండు సుమిత్రునికిఁ దగిలి యతఁడు మృతుఁ డయ్యెను.

అ—సుమిత్రమరణము నీ కభిమతముగ నుండునని తలఁచెదను. అతనియాస్తి నీకుఁ జేరును.

శం—అది నిజమే! అయినను, సుమిత్రుఁడు తన సొత్తునంతటిని కళావతి పేరట పత్రము వ్రాసినట్లును, నామెను వివాహమాడిన పక్షమున, తనయాస్తి ననుభవింప వచ్చుననియు నాతోఁ జెప్పెను.

అ—అటులనా? అట్లయిన, నీవిషయమునునేరితోఁజెప్పవలదు. ఉపాయముచే నాపత్రమును గ్రహించి, దానిని భస్మీకరింపుము.

శం—అట్లయిన నీకార్యమును ప్రవిధమమునఁ జేయవలెను. యింకేమియుదంతములు?

అ—పరంతపునికిని కామమోహినికిని నుపవనమునందు జరిగిన సంభాషణను నీకు మొదటనే తెలిపియుంటినిగదా! ఇప్పు డామె సత్యశర్మని గృహములో నుండుట గ్రహించి, మాఱువేషముతోఁ బోయి యాగృహముకొఱకుఁ దిరుగుచుండఁగా, పరంతపుఁ డాయింటిలోఁ బ్రవే

శించెను. తోడనే సత్యశర్మాదు లతనిని లోనికిఁ గొంపోయి యనేక విషయములను గూర్చి సంభాషించు చుండిరి.

శం—మిత్రుఁడా! నీవు చాల చతురుఁడవు. నీవుచేయునుపకారమునకు నా కృతజ్ఞతఁ జూపెదను. వారి సంభాషణవలన గ్రహించిన సంగతులను దెలుపుము.

అ—ఇంకేమియు లేదు. సత్యశర్మ రత్నాకరమాహాత్మ్యము ను గుఱించి ప్రస్తావించెను.

శం—అపుడు పరంతపుఁ డేమి చెప్పెను?

అ—విస్మయముతో వినుచు, తాను కొన్నిదినములు రత్నాకరమున నివసించెదనని చెప్పెను.

శం—అది యగునట్టికార్యము కాదు. రత్నాకర మితనివశము కాకుండఁ జేయు నుపాయము నాకు తెలియును. ఇంకేమి విశేషము?

అ—ఈదినముననే కామమోహినీ పరంతపులకు విధి పూర్వకముగ వివాహము జరిగినది.

ఈమాట వినఁగానే శంబరుఁడు మూర్ఛజెంది, కొంత కాలమునకు దెలివి తెచ్చుకొని, యపారకోపావేశముతో నర్థపరునిఁ జూచి, ఓరీ! నీవు నన్ను మోసపెట్టితివి. వివాహ ప్రారంభమునందే నాకుఁ దెలిపియుండిన యెడల, నేను వచ్చి వివాహము నడ్డుపెట్టియుందునుగదా? వివాహము నిజముగా జరిగినదా? నీవు దర్శించితివా?

అ—అయ్యా! కోపింపవలదు. వివాహకాలమునందే తెలుపవలెనని వచ్చితిని. అప్పుడు నీవు గృహములో లేవు. ఒక చీటినివ్రాసి, నీమేజాబల్లమీఁద నుంచి, రాఁబోవు సంగతులను బరీక్షించుటకు నేను పోతిని. వీరిద్దఱి వివాహము నిర్విఘ్నముగ జరిగినది. ఇరుగుపొరుగు వారందఱును వచ్చి వధూవరుల నాశీర్వదించిరి.

శంబరుఁ డీవాక్యములను విని, "అర్థపరుఁడా! కార్యముమించి పోయినది. ఈ వివాహవిషయ మెవ్వరికిని తెలియఁగూడదు. పరంతపుని తక్షణమే వధించి, కామమోహినికి నాయందను రాగముండునట్లు చేసికొనియెదను. ఈ విషయమున నీ యభిప్రాయ మేమి?" అనెను.

అ—ఇది కష్టసాధ్యము. వివాహము ప్రక్కలనున్న యయిదాఱిండ్లవారికి తెలిసిపోయినది.

శం—అట్లయిన, నీ సంగతి తెలిసినవారి నందఱను వధించిన యెడల నామనోరథము సిద్ధించును.

అ—అది సాధ్యమగునా? పరంతపుఁ డసామాన్య ప్రజ్ఞావంతుఁడు. మన ప్రయత్నము ప్రచుర మైనచో మరణదండనకు గుఱియగుదుము.

శం—భయపడవలదు. నీవుకోరినసొమ్ము నిచ్చెదను. మత్ప్రయత్నమునకు సహాయుఁడవు కమ్ము.

అ—అయ్యా! శంబరుఁడా! నీ వియ్యఁదలఁచిన ధనమును మొదట నిమ్ము. ఈప్రయత్నములో చిక్కుకొనిన వక్షమున గుప్తదానమునిచ్చి తప్పించుకొనవలసి యుండును. తోడనే శంబరుఁడు తన యొద్దనున్న కొన్ని రత్నాభరణములను నర్థపరుని కియ్యఁగా, నతఁడు "మిత్రుఁడా! నీ వలన నెన్ని విపత్తులు వచ్చినను ననుభవించుటకు సిద్ధముగ నున్నాను" అని పలికెను.

శం—అట్లయిన యెడల నానీచుఁడైన పరంతపునిఁ జంపవలెను.

అ—ఇది యసాధ్యము. దీనికి నేను ప్రయత్నించినచో నాశిరస్సు పోవును.

శం—వానినీ వధించుట యావశ్యకము కాదు. వానిని చెఱసాలలో నుంచి, హింసించిన యెడల వాఁ డాత్మహత్య చేసి కొనును.

పిదప కామమోహినిని వివాహమాడవచ్చును.

అ—అతని నుపాయముచే పట్టుకొని, కారాగృహమునం దుంచెదము. మాధవునిపత్రము నపహరించి, రత్నాకరము నీవశ మగునట్లు చేసెదను. పరంతపుఁడు మరణించెనని కామమోహినికిఁ దెలియఁబఱచి, యామెను నీవు పెండ్లిచేసికొనవచ్చును. ఇట్లుకాక, నీవు ప్రాణహింసకుఁ బ్రియత్న పడునెడల నీ సహవాసమును త్యజించెదను. నీకిష్టమైన నీ యాభరణములను దీసికొనుము.

దీని నాకర్ణించి శంబరుఁడు భగ్నమనోరథుఁడై యుండుటయే కాక, స్వప్రయత్నమును నర్థపరుఁడు వెలిపుచ్చునేమోయని భయవ్యాకులుఁడై యీ హత్యవిషయ మిఁక నితనితో ప్రస్తావింపఁ గూడదని నిష్కర్షించుకొనెను.

అ—ఏమి యాలోచించుచున్నావు?

సం—ఏమియు లేదు. నీవు చెప్పినట్లు చేయుటయుక్తము. పరంతపుని సంహరించుటకంటె చెఱలో నుంచుటయే మేలు. మాధవుని పత్రమును సంపాదించు టెట్లు?

అ—ఈ దిన ముదయముననే యీపత్రము రిజిష్టరు చేయుటకు పరంతపుఁడును, నేనును వెళ్ళితిమి. రిజిష్ట్రారుఁడొక్కఁడు మాత్రమువచ్చియుండెను. అతనికి మేము పత్రమునిచ్చి, దానిలోని సంగతు లన్నిటిని స్పష్టపఱచి, మఱునాఁడు పత్రమునకు వచ్చెదమని చెప్పితిమి. ఇప్పుడు నీవొక వేయిరూపాయల నిచ్చినచో రిజిష్ట్రారున కిచ్చి యీ పత్రమును దెచ్చెదను.

శం—నాయొద్ద రొక్కము సొమ్ములేదు. నగ నిచ్చెదను. దానినిఁగుదువపెట్టి, రొక్కముతీసికొని పొమ్ము. అని యొక్క రత్నహారము నిచ్చెను.

అర్థపరుఁడు దానిని తాకట్టుపెట్టి, కావలసిన సొమ్ముననుగ్రహించి దానిని రిజిస్ట్రారునకు లంచముగనిచ్చి, పత్రమును దెచ్చి, శంబరుని కొప్పగించెను. ఆతఁడు దానిని భద్రపఱచి యుంచెను.

సాయంతనమునకే పరంతపునితో రత్నాకరము వచ్చెదననియు, నచ్చట నతనిని బట్టుకొని చెఱలో నుంచు ప్రయత్నమునకు నేర్పాటు కావింపవలసిన దనియు శంబరునితోఁ జెప్పి, సెలవు తీసికొనెను.

---

## అధ్యాయము 10.

—)o(—

ఆసాయంకాల మర్థపరుఁడు పరంతపుని నివాసభవనమునకుఁ బోయి, యతనితో రత్నాకరమునకుఁ బయలుదేఱెను. అర్థపరుని మెల్లఁగాఁ బోవుచుండుమని పచించి, పరంతపుఁడు సత్యశర్మగృహము ప్రవేశించి, కామమోహినీసత్యశర్మలకుఁ దనరత్నాకర ప్రయాణ మును దెలిపెను. దానినివిని, కామమోహిని భయాన్వితయై "ప్రియుని హస్తమును బట్టుకొని, రత్నాకర మపాయకర దుర్గస్థలము గాన నచ్చటికి బోవలదని నిర్బంధించి వేఁడుకొనఁగా పరంతపుఁడు ప్రియురాలా!నీకింత భయమేల? నేనాయుధపాణినై యుందును. అచ్చట జనులకు సంభవించు నాపదలు నన్నుఁ దగినవికావు. రత్నాకరమును నీకు నివాసభవనముగఁ జేయవలె నను సంకల్పము గలిగియున్నాను. దానియందుఁ గావలసిన మార్పులను జేసి, మీయెల్లఱను నచ్చటికిఁ గొంపోవుదును"అనెను. సత్యశర్మాదులా యువతికి ధైర్యము చెప్పిరి.

కా—ప్రియుఁడా! మీధైర్యసాహసములు నాకు భయావహ ములుగనున్నవి. ఆసౌధము మనకు నివాసయోగ్య మగునని నాకు నమ్మిక లేదు. మఱియు, మిమ్ములను నేను మరలఁ జూతునో లేదో యను సంకోచము నా మనస్సునందు నెలకొనుచున్నది.

ప—ఏమిది? నీవుకూడ నిట్లు బెదరుచున్నావు. రేపు మధ్యాహ్నములోపుగనే యిచ్చుటకు వచ్చెదను.

స—మీరు బహు జాగరూకులుగ నుండవలెను. ఆ ప్రదేశము భీకరభూత ప్రేతములకును, ననేక దుర్దేవతలకును నాశ్రయముని విను చున్నాను.

ప—అయినను మీరు చింతింపవలదు. నేను వచ్చువఱకు నా ప్రియురాలిని గాపాడుడు. (కామమోహినిం జూచి) ప్రియా! యీ నోటులను జాగ్రత్తగ నుంచుకొని, సత్యశర్మాదుల ఖర్చునకుం గావలసిన సొమ్ము నిమ్ము. ఈధనవినియోగ విషయమునందు సర్వస్వాతంత్ర్యమును వహింపుము.

వారి యనుమతినిం బొంది, పరంతపుఁడు త్వరగాం బోయి, యర్థపరుని గలసికొనెను. సూర్యాస్తమయమునకు లోపుగ రత్నాకర సమీపము నుజేరి, దాని రామణీయకమును పరిశీలించి, పరంతపుఁడు, "ఆహా! ఇది యెంత సుందరభవనము! దీని శిల్పిచాతుర్యమును నాదిశేషుఁడైనం బొగడలేఁడు" అనెను

అ—నివాసానర్హమైన సౌధము గోరీవంటిది. దీనిని జూచి, నీ వక్కజ పడుచున్నావు.

ప—నీ నేత్రములు రోగపీడితము లవి నాకుం దోఁచుచున్నది. ఈ మందిరము నీకు సమాధివలె కనఁబడినచో నీ వివేకశూన్యత నెట్లు వర్ణింపవచ్చును?

అ—'పుట్టింటివారికి వందికొక్కయినను ముద్దు' అను సామెత నీయందు సార్థకమైనది. లోపలికి పోదము.

ఇరువురును మాటలాడుచు రత్నాకర ద్వార సమీపమునకుం బోయి, తమతమ తురగములను కవాటప్రాంతమునం గట్టివేసి, గుండ్లు

నిండించిన పిస్తోళ్లను చేతఁ దీసికొని, ప్రాకారమును దాఁటి దీపముతో లోనికిఁ బ్రవేశించిరి. ఆకట్టడ మంతయు కృష్ణశిలతో చిత్తాకర్షముగ నిర్మింపఁబడియుండెను. దీని చత్వరమున నుభయపార్శ్వము లందును సేవకనివాసయోగ్యముగ పండ్రెండు పండ్రెండు గదు లుండెను. వాని లోపల చిత్రవిచిత్రములైన ప్రతిమలును, దీపగోళము లుండెను. అంత ద్వారమును దాఁటి చూడఁగా నతిరమణీయమగు నొక కొలువుకూటమును, దాని కిరుప్రక్కల, జలువరాతితో నిర్మింపఁబడిన గదులును కన్నులకు గోచర మయ్యెను. వీనిని దాఁటఁగా నొక రమణీయమగు నుపవన ముండెను. దాని చతుష్కోణములందును నాలుగు దివ్యమైన కట్టడములు భాసిల్లుచుండెను. అవి యేడంతస్థులతో కన్నులకు మిఱుమిట్లు గొలుపుచుండెను. ఆయుపవనానంతర మొక బయలుండెను. దాని మధ్యమున నుండిన రెండంతస్థుల మేడను బరీక్షించిచూడఁగా దానిలోని ప్రతిగదియు నొక్క వాతాయనముగూడ లేక క్రూర మృగములు గాని, కారాగృహనివాసార్హులు గాని యుండుటకుఁ దగి యుండెను. పరంతపార్థపరులు వీని నన్నిటిని నిర్మించుట కెన్ని లక్షల రూప్యములు వ్యయమైయుండునో యని యాశ్చర్యపడుచుండఁగా రాత్రి పండ్రెండు గంట లయ్యెను. పరంతపుఁడు కొంతసేపువిశ్రాంతిని గోరఁగా—

అర్థపరుఁడు—బాగున్నది! నడిరేయియం దిచ్చట నుండుట భయాస్పదమైనది. ఈప్రదేశము భూతప్రేతములకు ముఖ్యాశ్రయము.

ప—ఏమిది? విద్యావంతుఁడవయ్యు, లోకవ్యవహారజ్ఞుఁడవయ్యు నీ విటుల భయపడుచున్నావే! యుక్తాయుక్తవివేకములేక పసిపిల్లల రీతిఁ బలుకుచున్నావు.

అ—అట్లయిన నేను పలుకునది నిజమో లేక యబద్ధమో క్షణకాలములో వ్యక్తమగును.

ఈరీతిని మాటలాడునంతలో శంబరుని సహాయముతో నర్థపరుఁడిదివఱలో నిర్మించియుండిన మనుష్యముఖసర్పాకారయంత్రము పరంతపుని కభిముఖముగ రాఁగా, నతఁడు చేతనుండు పిస్తోలును గాల్చెను. తోడనే వెనుకనుండిన భటులు కొందఱు పరంతపుని పిస్తోలును గ్రహించి, యతని కాలుచేతులకు సంకెళ్ళనువేసి, ప్రక్కగదిలో నుండిన శంబరునియొద్దకు లాగుకొనిపోయిరి. అప్పుడు కొంతతడవు పరంతపుఁడుదిగ్భ్రాంతుఁడై, ఓహో! మోసపోతిని. నన్ను వధించుటకు శంబర ప్రేరేపణ వలన నర్థమే మోక్షమని భావించునరాధముఁడగు నర్థపరుఁడు పన్నిన తంత్రమిది. వీని హస్తగతుఁడనైతిని. వీరివలన నెట్టిబాధలు రానున్నవో గుర్తెఱుఁగను. అని నానావిధములుగఁ జింతించుచుఁ గొంతసేపు స్తబ్ధుఁడై యుండెను.

శం.—ఓరీ కుటిలుఁడా! నాయందనురక్తురాలగు వనితను స్వాధీన పఱచుకొంటివా? ఇప్పుడేమి చెప్పెదవు?

ప.—చెప్పునదేమున్నది? నీవత్యంతక్రూరుఁడవు, కలుషాత్ముఁడవు, దుర్మదాంధుఁడవు. నన్ను నీవు బంధించితినని గర్వపడకుము. నీమోద మస్థిరము. నీకుఁ దోఁచు ప్రతీకారము లన్నిటిని జేయుము. వానికిఁ దగిన ప్రతిఫలము ననుభవింతువు. నీబెదరింపులకు నేబెదరువాఁడను గాను. నన్నుఁ బ్రాణముతో వదలిన యెడలఁ దగిన ప్రాయశ్చిత్తము నేను చేసెదను. నన్ను నీవు చంపునెడల, నిన్ను వేఱొకరు తప్పక వధింతురని నమ్ముము.

శం.—మాధవుని పత్రము నాహస్తగతమైనది. రత్నాకరము నీదను దురభిమానముచే గర్వపడుచున్నావు. ఇప్పుడు కామమోహినియు, రత్నాకరమును నావి యని గ్రహింపుము. నీ పాణిగృహీతికి ప్రియుఁడనై, నాకుఁ జేరవలసిన మాధవుని సర్వస్వమునకును యజమా

నుండనై, ప్రతిక్షణము నిన్ను హింసించుటవలనఁ గలుగు నానందముతో జీవింపవలెనని యభిలషించుచున్నాను.

ప—ఓరి నరాధమా ! నీప్రలాపములను చాలింపుము. భగవత్కృపవలన నాకు బంధవిమోచనమైనచో నీజిహ్వనుజీల్చి, భూతాహారము చేసెదను. నాకు విడుదల రానియెడల నీదుష్కృత్యములే నిన్ను భస్మీకృతునిఁ జేయును.

శం—ఓరి కరాళా! ఈనీచుని బంధించి, నిత్యము రెండు డజనుల ప్రహారణముల నొసఁగుచుండుము. ఇతనికి నొకపూఁట మాత్రమే స్వల్పాహారము నిమ్ము. ఇతనిని గొట్టునపుడు జాగరూకుఁడవై ప్రాణము పోకుండఁ జూడుము, ఆత్మహత్యకు నవకాశము లేకుండఁ గూడఁ జూచుకొనుము. అని చెప్పి, శంబరుఁడు తన నివాసగృహమునకు వెడలిపోయెను.

పరంతపుఁడు కారాగృహమున తన దురదృష్టమునకును, నర్థపరుని వంచనకును జింతించుచు కాలము గడపుచుండెను.

రెండవరోజు మధ్యాహ్నము శంబరుఁడు సుమిత్రుని గదిలోఁ బ్రవేశించి, యతని కాగితము లన్నిటిని వెదకుచుండెను. సుమిత్రుఁడు కళావతికి వ్రాసియిచ్చిన పత్రము నపహరించి, యర్థపరుని సాహాయ్యమున వేఱుపత్రమును సృష్టిచేసి, పరంతపునిఁ జంపించి, కామమోహినిని వివాహమాడి, కళావతి కేమియు లేకుండఁ జేయవలెనని యుద్దేశించియుండెను. ఇంతలో నతనికి సుమిత్రుని పత్రము దొరకెను. 'ఇఁక నేను కృతకృత్యుఁడను.' అని కేకవేసెను. ఆకేకను వినిన కళావతి యచ్చటికివచ్చి, యే మంటివి యని ప్రశ్నించెను.

శం—ఎవరు? కళావతియా?

క—ఔను, కళావతి.

కళావతి హస్తగతమైన పిస్తోలుతో శంబరుని యమపురికిఁ బంపు సంకల్పము కలిగిన మృత్యుదేవతను బోలియుండెను.

శం—కళావతీ! నీ వింత రౌద్రముగ నున్నావేమి? పిస్తోలును పాఱవేయుము. స్త్రీలకు పిస్తోలు భూషణము కాదు.

క—స్త్రీల కెట్లు పిస్తోలు తగినదికాదో పురుషులకు పరస్వాపహారణ మనర్హమైనది. ఈ కాగితములను పూర్వపుస్థానమునం దుంచిన యెడల, నీకింకను కొన్నిదినము లాయుస్సుండును, అట్లు కానిపక్షమున, నీదౌరాత్మ్యఫలము ననుభవింతువు. కాగితములను క్రిందఁబెట్టివెడలుదువా? లేక, యమసదనమార్గమును పట్టుదువా?

శం—వెఱ్ఱిదానివలె మాటలాడక పిస్తోలును పాఱవేయుము.

క—నీవు పరమనీచుఁడవు. ఈపత్రములను నాకిచ్చివేయుము; లేనియెడల నాకార్యము నేను చేసెదను.

శం—ఈ కాగితములు నీవి కావు; ఇవి నావి.

క—నీ వసామాన్య చోరుఁడవు, నిన్ను చోరశిఖామణి యననోపు. కాగితముల నిచ్చివేయుము.

ఈపెస్థైర్యమును బరిశీలించి, యీమెకు నాకాగితముల నొప్పగించి, 'కళావతీ! ఇప్పటికైన రోషమును వదలుము. నీ మామ తన యాస్తిని నాకిచ్చియున్నాఁడు' అనెను.

క—నీవు చెప్పినదికల్ల, నన్ను నీవు పాణిపీడనము చేసికొనిన పక్షమున నామామ యాస్తిలో నర్ధభాగము నీవశమగును. కానియెడల, నీకొక్క చిల్లిగవ్వ కూడ రానేరదు.

శం—నేను నిన్ను పెండ్లియాడెదనని తలంపకుము. నా కను రూపరత్న మొక్క కామమోహినియే.

క—కామమోహినియాస విడువుము. ఆమెకు పరిణయమైనది.

శం—నీవ్యర్థపుమాట లేల? చండాలుఁ డగు పరంతపుని యువ తార యొక్క క్షణములో పరోక్షము కాఁగలదు. అప్పుడు కామమోహిని నా దాసిగాను, నాయకిగాను నుండును.

ఈమాట చెవినిఁ బడఁగానే కళావతి యధికక్రోధపరవశ యయ్యెను. ఆదురాత్మునిఁ జంపుటకు యోజించుచుండెను.

క—నీయం దనురాగహీనురాలైన కామమోహినియొక్క ప్రియుని నీవు వధించి, యామెను చెఱుప నుద్యుక్తుఁడవై యున్నట్లు తోఁచుచున్నది. ఇది ఘోర పాపకృత్యము. కామమోహిని ప్రాణ త్యాగ మొనర్చునేకాని, నీవంటి దుర్మార్గునిఁ జూడనైనఁ జూడదు. నిన్నుఁ బోలిన చండాలునకుఁ బరిశుద్ధ పతివ్రతాశిఖామణి యగుకామ మోహిని జాయ యగునా? నీవఁటివానిని వధించుటయే యుచితము. ఇట్లు పలికి, పిస్తోలు నెత్తెను.

ఇంతలో దెబ్బతగిలిన వ్యాఘ్రమువలె శంబరుఁడు కళావతిపైఁ బడి హస్తమందలి పిస్తోలును, పత్రమును లాగుకొని, గొంతు పిసుకఁగా నామె నిట్టూర్పు విడుచుచు జీవితమంతరించినట్లు క్రిందఁ బడెను.

---

## అధ్యాయము. 11.

—(౦)—

పరంతపుఁడు రత్నాకరమునకు వెడలిన రాత్రి కామమోహిని తనప్రియుని కెట్టి యనర్థములు గలుగునో యని, యసాధారణ భయముచే మనోవ్యథ పడుచు సూర్యోదయము కాఁగానే భర్త రాక కామె నిరీక్షించుచుండెను. సూర్యుఁడు నడినెత్తికి వచ్చెను. ఆమె నిట్టూర్పులు విడుచుచు దుఃఖించుచుండగా సత్యశర్మ చూచి "ఇచ్చటి

నుండి రత్నాకరము చాల దూరమున నున్నది. నీభర్త నిరుపమాన ధైర్యవంతుఁడు. శోకింపవలదు'' అని యామె నోదార్చెను.

కా—విచారపడకుండుట యసాధ్యము. నాప్రియుని కేదో యుపద్రవము తటస్థించినది. నేను నిర్భాగ్యురాలను.

స—ఓచిన్నదానా! దుఃఖాతిశయముచే పరితపింపవద్దు. నీభర్త రానియెడల నేనురత్నాకరమున కేగి యతనిని బిలిచికొని వచ్చెదను.

కా—ఓ ప్రియజనకా! ఒకవేళ నాభర్త రానియెడల మీరే నన్ను రక్షింపవలెను. మీరే నాతండ్రి. సత్యవతియే నాజనని. నాసొమ్మును గ్రహించి, నామానమును కాపాడుఁడు.

స—ఓపతివ్రతా శిరోమణీ! చెడ్డతలంపులకు చోటియ్యవలదు. దుఃఖము నణఁచుకొనుము.

సంధ్యాకాలమయ్యెను. ఉపదేశములు వ్యర్థములయ్యె. కామమోహిని దుఃఖమునకు మేర లేకుండె. అప్పుడు సత్యశర్మ రత్నాకరమునకు బయలుదేఱి వెళ్లెను. కొంతతడవునకు కామమోహినియొక్క పై విలాసమునకు నొక జాబువచ్చెను. దానినామెచదివెను. అశని పతనముచేఁ గూలిన తరువువలె నామె నేలఁగూలెను. ఆజాబునం దిట్లు వ్రాయఁబడియుండెను.

కామమోహిని!

నీభర్త రత్నాకరమునకుఁ బోవలెనని నన్నుఁ బిలిచెను. ఆస్థలము భూతప్రేతపిశాచ భూయిష్ఠమనియు, నచ్చట కేగినచో నసుధారణముతో మరలివచ్చుట యసాధ్యమనియు, నేను మందలించితిని. నాపలుకుల నతఁడు వినఁ డయ్యెను. అతఁడు మొదట గత్నాకరము లోనికిఁ బ్రవేశించెను. ప్రవేశ క్షణముననే యొక భీషణభూతము కన్నులకుఁ గానవచ్చెను. దాని నిర్వర్ణనము తోడనే నేను భయవిహ్వలుఁడనై

పాటిపోతిని. పరంతపుఁడు దానితో స్వల్పకాలము పోరాడెను. అది యతని నంతరిక్షమునకుఁ గొంపోయి, చంపివేసినది. అతని శవము రత్నాకరపశ్చిమపారావారమునందుఁ బడి జలచరముల కాహార మయ్యెను. నాకు మిత్రవియోగ దుఃఖమధికముగ నున్నది. సుగుణవంతుఁడగు పతినిఁ బోఁగొట్టుకొనిన వ్యధకు దరియుండదు. సర్వేశ్వరుఁడు నిన్ను రక్షించుఁగాత. అతని యుత్తర క్రియలనుజరిపి, యతనికి సద్గతిఁ జూపుము.

అర్థపరుఁడు.

మూర్ఛఁజెందిన కామమోహినికి సత్యవతి పెక్కుశైత్యోపచారములను జేసెను. ఆమెకు కొంత తెలివిరాఁగా తిరిగిమూర్ఛఁజెందుచు, నిట్లు నిశి మూఁడుయామములు గడియగడియకు స్పృహపోవుచు, బాధపడుచుండెను. పరంతపవృత్తాంత మొకింతయు తెలియుటచే రత్నాకరమునకు వెడలిన సత్యశర్మ మరలివచ్చి కామమోహినికి వచ్చినలేఖను జూచి, యిది యర్థపరుని వ్రాఁతకాదు. అతని వ్రాలులేదు. ఎవరో దుష్టాత్ముఁ డీమెను క్లేశపఱచుట కిట్లు వ్రాసియుండును. అనిపలికి, వైద్యు నొకనిఁ బిలిపించి, నిద్రాజనకమగు నౌషధమును నిప్పించెను.

అంతలో నెవరో కవాటమును గట్టిగా కొట్టిరి. సత్యశర్మ యరరమును తెఱవఁగా నాయుధపాణులైన పండ్రెండుగురు సేవకులతో శంబరుఁడు లోనికిఁ బ్రవేశించెను.

స—అయ్యా! మీ రెవరు? మీ రీ నిశీథమున వచ్చుటకు కతమేమి?

శం—నన్ను నీవెఱుఁగవా? నేను శంబరుఁడను. కామమోహిని సంరక్షణకర్తను. నీ వీమెను వంచనచేఁ దెచ్చి యిచ్చుట దాఁచిన విషయ మిప్పుడే నాచెవినిఁ బడినది. త్వదపరాధార్హమగు శిక్ష నతిశీఘ్రమునఁ బొందుదువు.

స—ఓహో! ద్రవ్యార్థము పితృవ్యునిఁ జంపిన నరాధముఁడవు నీవేకదా? కళావతి వివాహమున కొప్పుకొనినమాట త్రోసివేసి, పరస్త్రీయగు కామమోహిని నపహరించుట కుత్తరమును వ్రాసినదుర్జనుఁడవు నీవుకాదా? నీవు కామమోహిని పాలిటి కాలుఁడవు.

శం—ఆమె యెచ్చట నున్నదో తెలుపుము. తెలుపనిచో నేను నీపాలిటి కాలుఁడను గూడ నగుదును.

స—నాయును రుండువఱకు నామెనీకు లభ్యముకాదు.

ఈమాటవిని, క్రోధపరవశుఁడై, తన సేవకుల సాహాయ్యముచే సత్యశర్మాదులను బట్టుకొని, వారిముఖద్వారములందు బట్టలను దుఱిమి, యొకగదిలో నిదురపోవుచుండిన కామమోహినిని బంధించి, వీరినందఱను నొకశకటములో నెక్కించుకొని, వారియింటికి నిప్పుపెట్టి వెడలి పోయెను. మఱునాఁడుదయమునకు సత్యశర్మనివేశముపూర్ణముగ దగ్ధమై, నేలతో సమమయ్యెను. పంచాయితీదారులు పరిశోధనానంతర మనలముచే సత్యశర్మనిలయము దగ్ధమైనట్లును, దానివలన సత్యశర్మాదులు స్వర్గస్థులైరనియు ప్రచురపఱిచిరి.

---

## అధ్యాయము. 12.

—)o(—

శంబరుఁడు సత్యశర్మాదులను, కామమోహినిని, రత్నాకరము లోని వెవ్వేఱు గదులలో ఖైదుచేసి, స్వభవనమునకుఁ బోయి, తా నొనర్చిన దుష్కృత్యముల కేమి ప్రతీకారము రాఁగలదో యని వెఱపుఁ జెందుచుండెను. కలరవము పిసుకుటచే కళావతి పరలోకవాసి కాలేదని వర్తమానము తెలిసెను. ఆమె తా నొనర్చిన కార్యమును వెల్లడి పఱుచునేమోయని దుఃఖించుచుండెను. 'కళావతి మృతినొందిన

బాగుగ నుండెడిది. ఆమె జీవించియున్నంతవఱకు నాకు విపత్పరంపరలు దప్పవు. మదపకారము నామె మఱవదు. మఱియు, నేపరిమాదములు సంభవించునో నేను గుర్తెఱుఁగను. నా కర్మఫలమును నే ననుభవింపక తీఱదు.' అని తలఁచుచుండెను. ఇంతలో కళావతి సేవకుఁ డొకఁడు వచ్చి, యొకయుత్తరము నాతని కిచ్చెను. దాని నతఁడు చింపి చదివెను. దానిలో నిట్లు వ్రాయఁబడి యుండెను.

ఖూనీ లొనర్చుటయందు సమర్థుఁడ వగు శంబరుఁడా!

ఈదినమున నేను నా శ్వశురనికేతనమును విడిచిపెట్టి పోవుచున్నాను. నీయును రుండు పర్యంతము మద్గృహధనముల ననుభవింపుము. అయినను, నీవు స్వల్పాయుష్మంతుఁడవు. కళావతి యసామాన్య. ఆమె దుర్జనులను దండధరస్థానమునకుఁ బంపు నవతార మనుకొనుము. జాగరూకతతో నుండుము.

కళావతి.

ఈజాబును జదివి, యధికాగ్రహమును బొంది, దానిని సహస్ర ఖండములు చేసి పాఱవేసెను.

కళావతీశీఘ్రసంహరణావశ్యకతను శంబరుఁడు తలంచి, యుచిత పథము నన్వేషించుచుండెను.

కల్యాణపుర భోజనశాలలో పరంతప భృత్యుఁడగు మంజీరకుఁడు బసచేసి, భోజనసదనము నంతటను వెదకి, భోజనశాలాయజమానుని సమీపించి, 'ఏతద్భవనమునకు మీరేనా యజమానులు?' అని ప్రశ్నించెను.

మం—కతిపయ దినములకిరిందట, నాయజమానుఁడును, నేనును వచ్చియుంటిమి. నాయజమానుఁడొక పీనుఁగును దెచ్చి, యిచ్చట దింపెను. అతని యుదంతము మీకుఁ దెలియునా?

య—మాధవుని కళేబరమును దెచ్చిన యతఁడా?

మం—ఔను. అతనిపేరు పరంతపుఁడు.

య—అతఁడు సుమిత్రగృహము చేరెను. అతనికిని శంబరునికిని ద్వంద్వయుద్ధమై, యతఁడు గాల్చిన గుండుదెబ్బ శంబరుని దక్షిణ భుజమునకుఁ దగిలెను. శంబరుని దెబ్బ గుఱితప్పి సుమిత్రునికిఁ దగిలి యతఁడు పరలోక ప్రాప్తుఁడయ్యెను.

మం—పరంతపుఁ డెచ్చట నున్నవాఁడు?

య—అతని రత్నాకరప్రయాణము మాత్రము నాకుఁ దెలియును. అర్థపరుఁడను న్యాయవాది యతని వెంట వెడలి యుండెను. పిదప పరంతపుని నేను జూడలేదు. అతఁడు రత్నాకరమునకుఁ బోవు నపుడు నాతో, 'నేను రత్నాకరమునుండి తిరిగిరానిచో, శంబరుఁడు నన్ను సంహరించియుండునని భావింపుము' అని వచించిపోయెను. నీవు రేపు ప్రొద్దున వచ్చిన పక్షమునఁ బరంతపుని వృత్తాంతమును సంపూర్ణముగఁ దెలుపుదును.

మంజీరకుఁ డతనియొద్ద ననుమతిని బొంది, తనచోటికిఁ బోవుచుండఁగా నతని మాటల నాలకించిన తరుణుఁ డొకఁ డతనితో సంభాషణ కుపక్రమించెను.

తరుణుఁడు—నీవు భోజనశాలాధికారితో పలికిన పలుకులను గ్రహించితిని నీవు పరంతపుని కొఱకు వచ్చితివా?

మం—ఔను! పరంతపుని మంచిచెడ్డలు నీకుఁ దెలియునా?

త—నా కంతగాఁ దెలియవు. అతఁ డీపురమునకు వచ్చిన తర్వాత నతనికిని నాకును పరిచయము కలిగినది. రెండుమూఁడు దినములనుండి యతని సంగతి తెలియలేదు. అతని కేద్దియో యుపాయము సంభవించి యుండునని తోఁచుచున్నది. నీవు నాగదికి వచ్చినచో మన మిరువురము సావకాశముగ సంభాషింప వచ్చును.

ఇద్దఱును దరుణుని గదికి నడచిరి.

త—నీపేరేమి?

మం—నేను పరంతప పరిచారకుఁడగు మంజీరకుఁడు.

త—నిన్ను గుఱించి పరంతపుఁడు ప్రస్తావించి యుండెను. నీవు చాల సాహసికుఁడవు. ఇట్టిభృత్యులు గల యజమానునికి సంకటములు గలిగినను నవి దైవయోగమువలన నమసిపోవును.

మం—అది యటుండనిమ్ము. పరంతపుని గూర్చి నీ వెఱిఁగిన విషయములను దెలుపుము.

త—పరంతపుఁడు స్వర్గస్థుఁడై యుండవచ్చును.

మం—ఈమాటలను నేను విశ్వసింపను. నీ నామధేయ మేమి?

త—కళావతి.

మం—ఓహో! పురుషవేషధారిణియగు స్త్రీవా నీవు?

క—ఔను. మహానీచుఁడగు శత్రువును గృతాంతపురికిఁ బంపు నుద్దేశముతో నేనీవేషధారణమును జేసితి.

మం—ఆ యరాతి యెవరు?

క—మహానుభావుఁడగు పరంతపుని మరణకారణభూతుఁడై యెవఁడుండవచ్చునో వాఁడే నాప్రత్యర్థి. కామమోహిని శంబరుని దిరస్కరించి, పరంతపుని నుద్వాహమాడిన ద్వేషమువలన శంబరుఁడు పరంతపుని సంహరించి యుండును. అట్లు చేసియుండని యెడల రత్నాకర కారాగృహములో నుంచియుండును. కామమోహినిని బలాత్కారముగ నపహరించినట్లు తెలియుచున్నది. రత్నాకరములోనికిఁ బోవ నెవరికిని నవకాశము లేనట్లు పహరా యుంచఁబడి యున్నది.

మం—పరంతప కామమోహినులు రత్నాకరములో నుండు నెడలను, ఆధనంజయుఁడేవచ్చి యచ్చట కావలికాచుచున్నను, నతనిని, శంబరుని జయించి పరంతప కామమోహినులను బంధమునుండి

తప్పించెదను. ఈ ప్రతిజ్ఞ తప్పినపక్షమునఁ బరంతప నేవానర్హుఁడ నని భావింపుము.

క—ఈ విషయములో నీకు నేను తోడ్పడెదను.

మ—ఈమర్గమార్గముమాత్రము నాకుఁజూపుము. పరంతపునిఁ గనుఁగొని, శంబరుని నరకమునకుఁ బంపు కార్యమును నాకువిడిచి పెట్టుము. ఈదినము చాలదూరము ప్రయాణము చేసియుండుటచే నలసి యున్నాను. రేపటి యుదయమున రత్నాకరప్రయాణము చేయుటకు సిద్ధముగ నుండెదను. నీవుకూడ నాతో బయలుదేఱుటకు సిద్ధముగ నుండుము. అని పలికి యిద్దఱును వారివారి స్థలములకు వెడలిరి.

---

## అ ధ్యా య ము. 13.

—.)o(.—

రత్నాకరము వివిధవర్ణభూషిత మగు సౌధము. దానియందు చిత్రవిచిత్రములగు కుర్చీలు, సోఫాలు, మంచములు, గాజుబొమ్మలు మొదలగునవి లెక్కలేకయుండెను. నేలమీఁదఁ బఱచియుండిన తివాసు లమూల్యము లైనవి. ఈ యగారద్వారమున నాయుధపాణు లగు, భృత్యు లిద్దఱు కలరు. లోనిగదిలో నొకదానియందుఁ బదునెనిమిది వత్సరముల ప్రాయముగల యువతి యొకతె యుండెను. ఆమె యధిక సౌందర్యముకలదైనను, అప్పుడే రోగమునుండి లేచినట్లును, నపార దుఃఖము ననుభవించుచున్నట్లును గనఁబడుచుండెను. ఆమెయే కామమోహిని. అప్పుడే యామెకు ప్రజ్ఞ కలిగెను. ఆమె కుపచారము చేయుటకుఁ గావలిస్త్రీ నొకదానిని శంబరుఁడు నియమించియుండెను. తెలివి రాఁగానే కామమోహిని యామెను జూచి, నీ వెవరు, అని యడిగెను.

'నేను నీదాసిని' యని యామె బదులు చెప్పెను.

కా—నిన్ను నియమించిన దెవరు?

దా—శంబరుఁడు.

కా—(తనలో) ఈచండాలుఁడు సత్యశర్మాదుల కేదో యుపద్రవముకలుగఁజేసి, నన్నపహరించుకొని వచ్చియుండవచ్చును. నేను శత్రుమధ్యమున నున్నాను. నావంటియనాథలకు దేవుఁడే గతి కదా? ఉండనిమ్ము. మనుష్యులను నమ్మిన ప్రయోజనములేదు. నేను సత్యవంతురాల నయినయెడల నాకష్టములనుపరమేశ్వరుఁడే తొలఁగించును. (ప్రకాశముగా) ఓసీ! నేనింతదనుక నొడలు తెలియక రోగపీడితురాలనై యుంటినిగదా?

దా—ఔనమ్మా! నీవుచాల జబ్బుగా నుంటివి. నీకుఁ దిరిగి ప్రజ్ఞ రాదని తలఁచితిమి. దైవవశమున నీవు బ్రతికితివి.

కా—మన మిప్పుడు రత్నాకరములో నున్నాము కదా?

దా—ఔను.

కా—న న్నిచ్చటికిఁ దెచ్చిన దెవరు?

దా—అది నాకుఁ దెలియదు.

కా—నే నిప్పుడు శంబరుని చెఱలో నున్నాను గదా?

దా—చెఱలో లేకున్నను, యజమానుని యాజ్ఞ లేనిదే యిచ్చటినుండి యెచ్చటకుఁ గాని పోవుటకు వీలులేదు.

కా—యజమానుఁ డని చెప్పవలదు. కారాగృహాధికారి యనుము. ఆదుష్టుఁ డిప్పు డెచ్చట నున్నాఁడు?

దా—కొన్నిదినములనుండి యిచ్చటికిరాలేదు. నీరోగము కుదిరి నీకు ప్రజ్ఞకలుగుపర్యంతము కన్నీరు కార్చుచు, నీపడక సమీపమున నే యుండి, యౌషధపథ్యాహారముల నొసఁగుచుండెను. నీకు

ప్రాణభయము లేదని తెలియఁగానే స్వల్పకార్యనిర్వహణమునకు వెడలి యున్నాఁడు.

కా—ఈదుర్మార్గుఁడు నేను వశ్యురాలనై యతని దురాగతములను మఱచి, నా పాతివ్రత్యమును నీ యుపచారములకొఱకు విక్రయింతునని తలఁచి యుండవచ్చును. ఈ ప్రపంచ సృష్టికర్తయగు సర్వశక్తుఁ డున్నయెడలను, దుష్టనిగ్రహ శిష్టపరిపాలనములను జేయుట యీశ్వరుని కార్యమైన యెడలను, సత్యోత్కటపాపములకీజన్మమందే శిక్ష యగునను ధర్మశాస్త్రవచనము సత్యమైన యెడలను, నీ శంబరుని కర్హమగు దండన మిక్కిలి త్వరలోఁ గాఁగలదు.

దా—నీవు చాల కృతఘ్నురాలవు. శంబరుని యుపకారమునకు ప్రత్యపకారము చేయఁ దలంచుచున్నావే. సాధ్యమైనచోఁ జేసినను జేయుదువు. నీవు పరంతపుని వివాహము చేసికొనుటలో నెక్కువ తొందరపడితివి. పరంతపుఁడు కడు దుర్మార్గుఁడు. అనాథయైన నిన్ను ప్రేమతోఁ జూచుశంబరుని విషయములో నీ వీరీతిని నడచుకొనుట ధర్మము కాదు.

కా—ఓసీ! నీ కలుషవచనములు నా వీనులకు శల్యప్రాయములుగ నున్నవి. పరంతప పంచతతో నేను వితంతువు నైతిని, అది యటుండనిమ్ము. నా పాతివ్రత్యమును భంగపఱుప నుద్దేశించిన శంబరునికి నీవు చేదోడగుట దుష్కృత్యము. దీనివలన నీ జీవయశస్సులకు ప్రతిబంధము కలుగును. పరంతపుఁడు నిజముగ స్వర్గస్థుఁ డయ్యెనా? నీవు చూచితివా?

దా—నేను చూచినది లేదుగాని, జనులందఱును చెప్పుకొనుచున్నారు. నాయుదర పోషణము కొఱకు నేను చేయరాని కార్యములను నే నొర్చుదానను గాను. నాకు శంబరుఁ డెట్టి దుర్బోధనను జేసినవాఁడుగాఁడు. పరంతపు ననుసరించి లోకాంతరమునకుఁ బోవలెననెడి

యుద్దేశ ముండిన నీ యిష్టప్రకారము నడచుకొనుము. నీకష్టసుఖములు నీ కరగతములు. శంబరుఁడు నీకుఁ జేసిన మహోపకార మొకటిగలదు. అది నీకింతవఱకుఁ దెలియదు. నీకుఁ దెలిసిన పక్షమున నీ ద్వేష మంతయును బ్రేమముగ పరిణమించును.

కా—(తనలో) ఈమె చాలగడుసుది. (ప్రకాశముగ) ఆమహోపకారమెద్ది?

దా—సుమిత్ర మరణానంతర మతఁడు పాపి యని కొన్ని కాగితములవలనఁ బ్రచురమైనది. అఖలుఁ డాశన్నాఁడు ద్వేషముచే ముగ్గురిని ఖూని చేసెను. ఇది కని, నీ జనకుఁడు సహింపలేక, సుమిత్రుని సర్కారువారి కొప్పగించుటకుఁ బ్రియత్నించెను. ఈకారణమున సుమిత్రుఁడు నీతండ్రికిఁ బరమశత్రువై, యతనిని రత్నాకరమున చెఱలో నుంచెను. సుమిత్రమరణానంతరమున శంబరుఁ డతనిని విడుదలచేసి యీ కట్టడమునందే పహారాపెట్టి యుంచినాఁడు.

కా—ఇప్పుడు నా తండ్రి యిచ్చట నున్నాఁడా?

దా—ఇచ్చటనే యున్నాఁడు. అయినను, శంబరాజ్ఞలేక కదలుటకు వీలులేదు.

కా—ఈమేలుకొఱకు నా పాతివ్రత్యమును నేను విక్రయింపవలెనని శంబరున కుద్దేశమున్నది కదా?

దా—నీ భర్త జీవించియున్నచో నీవు పరపురుషగమనము చేయుట వ్యభిచార మగుఁగాని, నీభర్త పరలోకవాసియైనపుడు వేఱొక ధవుని వరించుట దేహవిక్రియము కానేరదు. శంబరవాంఛ నెఱవేర్చి ప్రత్యక్షైహికసుఖము ననుభవింపక, బుద్ధిహీనవలె లోకమును విడిచి, యప్రత్యక్షమైన యాముష్మిక సుఖము నపేక్షించుట యుక్తియుక్తముగ నున్నదా? చక్కఁగ నాలోచింపుము

కా—నీ యుపదేశమును స్వైరిణులామోదింతురు. అది

పోనిమ్ము. నీవు నాతండ్రిని దెచ్చి నాకుఁ జూపుము. అతనిని జూడవలె నని చాల యభిలషించుచున్నాను.

దా — శంబరాజ్ఞ లేనిదే యెట్లు పిలుచుకొని వచ్చెదను?

కా — నేను చెప్పినట్లు చేయుము. లేకున్న నీకుఁ దగిన శిక్ష చేసెదను.

కామమోహినిస్థైర్యాకృతిని జూచి, యాదాది కామమోహిని యొక్క జనకునిఁ దెచ్చుటకు వెడలెను.

కామమోహినికిఁ బితృవియోగమై పదిసంవత్సరములైనది. ఆమె తండ్రిని జూడవలె నని తహతహ పడుచుండెను. ఇంతలో రమారమి యేబది వత్సరముల ప్రాయముగల మనుష్యునొక్కని నాదాది పిలుచుకొనివచ్చెను. అతఁడు కారాగృహవాసము చేతను, వ్యసనముచేతను కృశించి యుండెను. అతని కాయము శల్యావశిష్టమై యుండెను. కన్నులు గుంటలు పట్టియుండెను. శిరోజములు పలితములు. అతఁడు జీర్ణవస్త్రములను ధరించియుండెను. హస్తశృంఖలలు వేయఁబడినయతనిని జూచినతోడనే కామమోహిని లేచి నమస్కరించెను. ఇరువురనేత్రముల నుండి యశ్రుధారలు ప్రవహించెను. ఒకరి నొకరు కౌఁగిలించుకొనిరి. కొంతసే పయిన తరువాత,

కా — నాయనా! మనకు వియోగమై దీర్ఘకాల మయినది. ఈ సమాగమము నిజమేనా? లేక స్వప్నసుఖమా?

తం — బిడ్డా! కామమోహినీ! ఇది స్వప్నము కాదు. నేనే నీ జనకుఁడను. నిన్ను మరల దర్శింపఁ గలుగుదునని నే నెప్పుడును భావింపలేదు. పుణ్యావిశేషమున సర్వేశ్వరుఁ డీభాగ్యమును గలుగఁ జేసి యున్నాఁడు. నీ జనయిత్రి నీ బాల్యమునందే స్వర్గస్థురాలయ్యెను. నిన్నిపుడు చూచుటవలనఁ గలుగు నానంద మింతయని వచించుటకు వీలులేదు. అయిన నీ బంధనాలయమున్నకంటె నిధనమే మేలు,

కా—ఓ ప్రియజనకా! కష్టసుఖములు కావడికుండలు. మరణమును వాంఛింప వలదు. ఇంతదనుక మనము కృష్ణపక్షములో నుంటిమి, ఇఁక శుక్లపక్షము మనల నెదురు చూచుచున్నది.

తం—నాముద్దుబిడ్డా! స్త్రీయవస్థను నీవు సంపూర్ణముగ గ్రహించినట్లు లేదు. మృత్యువుకంటెఁ గ్రూరుఁడగు వాని యధీనములో నున్నాము. ఈకృష్ణపక్షముననే మనము లోకాంతరగతు లగుదు మని తోఁచుచున్నది.

కా—నాతండ్రీ! నాస్థితి నేనుగుర్తెఱుఁగుదును, దురాత్ముఁడగు శంబరుఁడు నాపాతివ్రత్యమును భంగపఱుచుటకు సిద్ధపడియున్నాఁడు. ఇది నెఱవేఱు సంకల్పమా? రావణాదు లిట్టి దుష్టునో వ్యాపారముచే యమాలయమును జేరలేదా? పాతివ్రత్యభంగకారకుల సంహరించుటకు సర్వశక్తుఁడు లేఁడా?

తం—నీ ధైర్య మసాధారణమైనది. నీకు నీశ్వరునియందునిశ్చల భక్తి కలదు. దేవుఁడు మాత్రము నిమీలితనేత్రుఁడై యున్నట్లు తోఁచుచున్నది. అట్లు కానిపక్షమున, నిట్టివ్యథ ననుభవించుట కేమి పాతకములను జేసితిమి?

కా—ఓతండ్రీ! బాధాపరవశుఁడవై నీ విట్లు పలుకుచున్నావు. సర్వవ్యాపి యెప్పుడుకాని కన్నులు మూసికొని యుండఁడు. మన యిరువురి దుఃఖమును నా మహనీయుఁడు గమనించుచునే యున్నాఁడు. వాని కుచితమగు ప్రతీకారము శీఘ్రముగా జరుగును.

తం—ఓతల్లీ! భగవంతునియెడ నిట్టి దృఢవిశ్వాస ముంచుట శుభావహము. ఈ క్రూర శంబరుని యిష్టార్థపరిపూర్తికి నీవొప్పనిచో మనల నిద్దఱను వధించు నేర్పాటు చేసియున్నాఁడు.

కా—ఓనాయనా! మర్త్యులెప్పుడును మృతిపాత్రులే. కతిపయ దినములకు ముందుగా మరణించుటవలన బాధక మేమున్నది?

ఇంతలో శంబరుఁ డచ్చటికి వచ్చెను. కామమోహినియొక్క వలపును సంపాదించుటకుఁగాను ఆమెతండ్రియొక్క చేతిసంకెలలను దీయించివేసెను. అతని గదికి నతనిని బంపి, వహారామాత్రి ముంచి యుపాయముతో స్వాధీన పఱుచుకొను నిమిత్తము కామమోహినితో సల్లాపము చేయుట కుపక్రమించెను.

శం—కామమోహినీ! నీజనకుఁడు పది సంవత్సరములుగ నీబంధన గృహమునం దనేకకష్టములు పడుచుండెను. ఇవన్నియు నేఁటితో ముగియును. నీకొఱ కతనిని బాధనుండి తొలఁగించెదను. నీవునాచేతిలో నున్నావు. ఈ రత్నాకరము మొదలైనవి నావి. కాలగోచరుఁడైన పరంతపుని యాలోచన విడిచిపెట్టి, నాయిష్టార్థపూర్తినిఁ జేసినచో నీ తండ్రికి బంధన విమోచన కావించుటయే కాక నిన్ను నాయాస్తిలో భాగస్థురాలిఁగఁ జేసెదను.

కా—ఓరీ ఘాతుకుఁడా! ఈ దుర్మార్గవచనమును విడువుము. కామమోహిని స్వైరిణి కాదు. ఆమె మహాపతివ్రత. పాతివ్రత్యభంగమును జేయఁ గోరిన రావణాదుల యవస్థ యేమయ్యెను? నీ సంపదలో నాకు భాగ మక్కఱలేదు. నాతండ్రి కష్టనివారణకొఱకు నీయిష్టార్థ సిద్ధి నొనరించుదానను.

శం—ఓసి వెఱ్ఱిదానా! శ్రీరాముఁడు బ్రతికియుండినందున నతఁడు రావణుని సంహరించి సీత పాతివ్రత్యమును గాపాడఁ గలిగెను. నీపాతివ్రత్యమును గాపాడుటకుఁ బరంతపుఁడు బ్రతికియున్నవాఁడా? బలాత్కారముగ నేనిప్పుడు నీ పాతివ్రత్యమును భంగ పఱిచినచో నాకెదు రెవ్వరు?

కా—ఓరికూళా! పరంతపుఁడు మృతినొందియుండినను, నా తండ్రి నీవశమున నుండినను నన్నుఁ జెఱుచుటకు నీ కెప్పుడుగాని

సాధ్యముకాదు. హెచ్చరికతో నుండుము. నా సాన్నిధ్యమును విడిచి బయటికిఁ బోకుము.

శం—ఓసీ కామమోహినీ! నీయిచ్చిమాటలకు నేను బెదరువాఁడను గాను. నీవు బుద్ధిశాలినివతె నడచుకొనుటకు నొక దినము వాయిదా నిచ్చుచున్నాను. రేపటియుదయమున నేను వచ్చులోపలనీ మూర్ఖతను వదలి, నన్నుఁ జేపట్టినయెడల సరి; లేనియెడల నీయెదుట నీజనకునిఁ జంపి, నీపాతివ్రత్యమును జెఱిచి, యనంతరము నిన్నుఁగూడ యమసదనమునకుఁ బంపెదను. జాగ్రత్త! (అని చెప్పి శంబరుఁడు వెడలి పోయెను.)

రాఁబోవు ఇరువది నాలుగు గంటలలో శంబరుఁడు శిక్షితుఁడు కానియెడల నాత్మహత్య చేసికొనుటకు నిశ్చయించుకొని, కామ మోహిని కాలము గడపుచుండెను.

---

## అధ్యాయము. 14

—.)o(.—

శంబరార్థపరులు పరంతపుని రత్నాకరములోని యొకగదియం దుంచి వెడలిపోయిరి కదా! అచ్చట పరంతపుఁ డిట్లు తనలోఁ దాను దలంచుచుండెను. "ఇచ్చట నుండి తప్పించుకొని పోవుట దైవకృప వలననే తప్ప మనుష్యప్రయత్నమున కిది దుస్సాధ్యము. ఈ బంధ నాలయవాసముకంటె నిచ్చోటునుండి తప్పించుకొనుటకు యత్నించి యా యత్నములో మృతినొందినను మేలు. అర్థపరుఁడు పరమద్రోహి."

ఇట్లు చింతించుచు, చేతిసంకెలలను గట్టిమున వదలించుకొనెను. పిదప చేతిని నొక జేబులోఁ బెట్టఁగా నొక నిప్పుపెట్టె, యొక ఘటికారము, ఒక ఛురికయు దొరకెను. ఒక నిప్పుపుడక వెలుతురునఁ

దా నొక శిలలోఁ దొలువఁబడిన చిన్నగుహలో నుండినట్లు కనఁబడెను. దీని కవాటము దృఢమైన యినుపకడ్డీలతో నేర్పడి, పెద్ద బీగము వేయఁబడియుండెను. ఈగహ్వరమం దొక మూలనుండి మఱియొక మూలకు నీరు ప్రవహించుచుండెను. ఈగదిలో నొక పర్యంకము, ఒక శయ్య, ఒక యుపదానము, ఒక కుర్చీ, ఒక మేజాబల్ల, ఒక జలపాత్రము, కొన్ని కాష్ఠములు, ఒక తువాలు ఉండెను. పరంతపుఁడు రెండు దినములుగ నాహారము లేక మిగులఁ బడలియుండెను. తన్ను నిరాహారునిఁగఁ జేసి చంపుదురని తలఁచెను. ఇట్లు పరితపించుచుండఁగా నొక కావలివాఁడు కడ్డీలసందునుండి యొక మూటను బడవేసెను. అతనిని జూచి,

ప—అయ్యా! మీ రెవరు? ఇచ్చటి కేలవచ్చితిరి?

కావ—మీతో మాటలాడుటకు నావకాశము లేదు. మూటలోఁ భక్ష్యములను భుజించి, ప్రవహించు నీటిఁ ద్రాగుము.

అప్పుడు పరంతపుఁ డిట్లు తలంచెను: "ఇతఁడు శంబరుని మనుష్యుఁడు. ఇతఁడు నాకు భక్ష్యములు తెచ్చియిచ్చుటకుఁ గారణ మేమైయుండును. వీనిలో శంబరుఁడు విషము పెట్టియుండునా? అట్లుండదు. నేను శంబరుని స్వాధీనములో నున్నాను. నన్ను వధింపఁ దలఁచుకొనినయెడల నది సులభము. ఈ కావలివాఁడు దైవప్రేరణచే నిచటికి వచ్చియుండవచ్చును. బహుశః నాకష్టనివారణకు వీఁడు తోడ్పడునేమో!" ఇట్లు యోజించుచు నాదినము గడపెను. శంబరుఁడు పరంతపుని నిరాహారునిఁగఁ జేసి సంహరింపఁ బోవుచున్నాఁడని తెలిసి కరుణాయుతుఁ డగు నాసేవకుఁడు శంబరునికి తెలుపకయే, భక్ష్యముల నిచ్చుటకుఁ దీర్మానించుకొనెను. రెండవ దినమునఁ బూర్వాహ్ణసమయముననే యతఁడు లాంతరుతో రాఁగా వాని శరీరమునుండి రుధిరము కాఱుచుండెను. వాఁడు తాళమును దెఱచి లోనికివచ్చి, తన గాయమును నీటితోఁ గడుగుకొని, పరంతపుని

చేరువనున్న యాసనమునఁగూర్చుండి, 'అయ్యా, నీవు పరంతపుఁడవా?' అని యడిగెను.

ప—అవును.

కావ—నేను రత్నాకరమునందలి కావలివాఁడను. శంబరుని యొద్దనున్న పత్రములను గడచిన రేయి ధర్మకార్యార్థముగ నపహరించి తిని. అతఁడు నన్ను గుండుతోఁ గాల్చెను. అప్పుడు నేనుమాత్రము గుర్తెఱిఁగిన రహస్యమార్గముగుండ నిచ్చటకువచ్చితిని. శంబరుఁడు చేసిన యపకారమునకు నీవు ప్రతీకారమును జేయునెడల నీకు బంధవిమోచన గావించెదను.

ప—నా విమోచనానంతరము శంబరుని చావు నిజము.

కా—నేను పదిసంవత్సరములు సుమిత్ర సేవకుఁడుగ నుంటిని. అతఁడు కామమోహిని తండ్రిని కారాగృహములో నుంచి, నాకు మంచి జీత మిచ్చి, యతనిని గాచుచుండు మనెను. నావేతనములోఁ గొంతభాగము ఖైదీ యుదరపోషణార్థము వ్యయపఱిచి, నేను కాలము గడపుచుంటిని.

ప—అతఁ డెచ్చట నున్నాఁడు?

కావ—శంబరుఁ డతని బంధవిమోచన చేసి, దాని సహాయముచే కామమోహినిని వరింపవలెనని యభిలషించుచున్నాఁడు.

ప—ఈపాపి నామె యుద్వాహము చేసికొనునా?

కావ—రేపటి యుదయ మెనిమిదిగంటల లోపుగ తన్ను వివాహము చేసికొననియెడల నామె తండ్రిని జంపి, కామమోహినిని జెఱిచి, యనంతర మామెను సంహరింప సంకల్పించియున్నాఁడు. శీఘ్ర కాలములో నీ వితనిని వధించినయెడల కామమోహినికిని, నా పెతండ్రి కిని మానప్రాణహానులు తప్పును. ఈపత్రములను దీసికొనుము. ఇది సుమిత్రుని మరణదానపత్రము. దీని నర్థపరుఁడు రిజిష్ట్రారు నొద్దనుండి

లంచ మిచ్చి తెచ్చినాఁడు. రేఁడవదానియందు కళావతినిఁ బెండ్లి యాడినవానికిఁ దనయాస్తి నిచ్చునట్లు సుమిత్రుఁడు వ్రాసి యున్నాఁడు. ఈపత్రిమును కళావతినుండి శంబరుఁ డపహరించెను. దీని నపహరించి, కళావతి కిచ్చుటకుఁ బ్రయత్న పడుచుండఁగా, శంబరుఁడు నన్ను గుండుచేఁ గాల్చెను. ఇఁక విశేషము మాటలాడుటకు సమర్థుఁడను గాను. ఈసుర్గమునుండి వెలికిఁ బోవు మార్గమును నీకుఁ జూపి, నేను ప్రాణమును విడిచెదను. ఈరత్నాకరమునకు నయిదుగురు రక్షకభటులు కలరు. వారు మిక్కిలి దుష్టులు. కాఁబట్టి నీవు శత్రునిగ్రహమున నతిజాగరూకతతో మెలఁగవలయును. అట్లుకానియెడల, నీ కపాయము తటస్థించును.

ఇట్లు చెప్పి, యేకాంత మగు నొక సొరంగమార్గమున నతనిని స్వల్పదూరము పిలుచుకొనిపోయి, యొక తలుపుమీఁద నుండిన గుబ్బను నదిమెను. తోడనే కవాటము తెఱవఁబడెను. ఆయరరమును మూయుటకు సాధనమగు వేఱొకగుబ్బను పరంతపునికిఁజూపి యాసొరంగములోని యేకాంతమార్గముల విశేషములను దెలిపి, కావలివాఁడు వెనుకకుఁ దిరిగిపోయెను.

---

## అధ్యాయము. 15.

—)O(—

పరంతపుఁడు రత్నాకరమును విడిచి, మాఱువేషము వేసికొని, కళ్యాణపురమునకుఁ బోయి, యేకాంతముగ సమరసింహునితో నడచిన సంగతు లన్నిటినిఁ దెలిపెను.

స—దురాత్ముఁ డగు శంబరుని శిక్షించి, నీభార్య మొదలగు వారిని విడుదల చేయుటకు నాసాహాయ్యమును గోరుచున్నావు కదా?

ప—అవును. మీతోడ్పాటు లేనిదే యీపని ముగియదు. అది యటుండనిమ్ము. ఈపట్టణపు మేజస్ట్రేటెవరు?

స—నేనే మేజస్ట్రేటుగ నున్నాను.

ప—అట్లగుచో బలిష్ఠులైనట్టియు, యుద్ధసమర్థులైనట్టియు, పోలీసువారిని బిలుచుకొని బయలుదేఱుఁడు. ఒక యేకాంతమార్గమున మిమ్ములను రత్నాకరములోనికిఁ బ్రవేశపెట్టెదను. పిదప నేను సంజ్ఞచేయు క్షణముననే మీ భటులు శంబరునిపైఁ బడి పట్టుకొనవలెను.

స—సరియే, కానిమ్ము. సమయమునకు సరిగ నీభృత్యుఁడు వచ్చుచున్నాఁడు. వీని యాగమనము నీకు శుభసూచకము కదా?

ప—ఓహో! మంజీరకుఁడు వచ్చుచున్నాఁడే! వేయిభటుల సహాయము పొందినట్లాయినది. మంజీరకా! నీవు త్వరగా భోజనము చేసి రమ్ము.

స—మంజీరకుని సహాయార్థము నీ కెందఱు భటులు కావలెను?

ప—ఎనమండ్రయినఁ జాలును. హెచ్చుమంది పోయినయెడల నల్లరియై, శంబరుఁడు భయపడి కామమోహినిని మొదలగు వారిని జంపవచ్చును.

స—మీరంద అచ్చటికి వచ్చుటకుఁ బూర్వమే నేను మాఱు వేషముతో రత్నాకరమున కేగి, యందలి సమాచారములను గనుఁగొనెదను.

ప—ఇది యసాధ్యము.

స—సాధ్యాసాధ్యములను నీవు చూచెదవు. ఈ మంజీరకుని, నేను బంపు నెనమండ్రుభటులను బిలుచుకొని నీవు రత్నాకరము ప్రవేశింపుము. శంబరుని సమీపమున నన్ను నీవు చూచెదవు. (అని చెప్పి వెడలిపోయెను.)



సమరసింహుఁడు మాఱువేషముతో నొకయశ్వవాహనము నెక్కి
రత్నాకరముఁ జేరుట.

మంజీరకాదులతో వేషధారియైన పరంతపుఁడు రత్నాకర సమీపమునకుఁజేరి, యేకాంత మార్గముగుండ గుహలోఁ దానుండినగదిలోఁ బ్రవేశించెను. అచ్చట శంబరుని గుండుచే దెబ్బతినినవాఁడు మూలుగుచుఁ బడియుండెను.

ఇంతలో సమరసింహుఁడు పెద్దగుఱ్ఱములు గట్టిన యొక వాహనము నధిరోహించి, తనవలె మాఱువేషము వేసికొనిన యిద్దఱు భృత్యులను ప్రక్కలఁ గూర్చుండఁబెట్టుకొని, శతపరిచారకులు వెంట రాఁగా రత్నాకరమును జేరెను. అప్పు డచ్చటి రక్షక భటుఁడు లోనికి వెడలి, యెవరో గొప్పవారు వచ్చియున్నారని చెప్పఁగా, అర్థపరుఁడు వారెవరో కనుఁగొనుటకు వెలుపలకు వచ్చి, సమరసింహునిఁ జూచి, 'మీరెవరు?' అని ప్రశ్నించెను.

స—నేను సింధుదేశ నివాసి సగుకళింగుఁడను. నే నచ్చట న్యాయవాదిని.

అ—ఇచ్చటి కేకార్యార్థము విచ్చేసితిరున్నారు?

స—ఈదుర్గమునకు రత్నాకరమని నామధేయమా?

అ—ఔను.

స—దీని సొంతదారుఁడు శంబరుఁడా?

అ—అవును.

స—ఈ శంబరుని తాతకు రావలసిన యొక లక్షరూపాయలు కోర్టులో నిలవయుంచఁ బడినవి. వీనికి శంబరుఁడు హక్కుదారుఁడు. ఈ విషయము నితనికిఁ దెలుపుటకు వచ్చియున్నాను.

సమరసింహుని పలుకులకు నర్థపరుఁడు మహానందమును బొందెను. తోడనే వారినిఁ దోడ్కొనిపోయి, శంబరునితో ద్రవ్యవిషయము చెప్పెను. శంబరుఁ డత్యంత సంతుష్టాంతరంగుఁడై, సమరసింహాదులను సత్కరించి, వారి నొక గదియందుండుఁ డని ప్రార్థించెను.

పిదవ శంబరుఁ డర్థపరునితో, నీవు తెచ్చియిచ్చిన పత్రికను కళావతియొద్దనుండి నే నపహరించిన పత్రికను నాభృత్యుఁడు దొంగి లించెను. అప్పుడు నేను వానిని గుండుతోఁ గాల్చితిని. వాఁడు గవాక్ష ముగుండ వెలుపలకు దుమికి, పరుగుతీసెను. నీ వాపత్రమును సంపా దించి యిచ్చినయెడల నీ కుచితపారితోషిక మొసఁగెదను.

అ—నీమాటయందు నాకు విశ్వాసము లేదు. నే నిదివఱకుఁ జేసిన సహాయమునకు నీ వొక్కకాసైన నాకియ్యలేదు. ఇప్పుడు నా లెక్క నీవుపరిష్కారము చేయుఁ యెడల, భావికాలమున నే నేయుప కారమును జేయఁజాలను

శం—నీ విప్పు డెంతద్రవ్యము నపేక్షించెదవు?

అ—నాలుగువేల రూపాయలు. నీ వీసొమ్ము నియ్యనిచో నేను రాబట్టుకొందును.

శం—నీ వెట్లు రాఁబట్టుకొందువో రాఁబట్టుకొనుము.

అ—నీవు చేసిన హత్యలను, కామమోహిని నపహరించి యుంచిన సంగతిని సర్కారునకుఁ దెలిపిన యెడల నీయాస్తికిని నీప్రాణ మునకును హాని కలుగును. నీ కీదినమున లక్షరూపాయలు దొరకు చున్నవి కదా! నాకు నాలుగు వేల నిచ్చిన నీకు కష్టము వాటిల్లదు. లేనియెడల నీ వనేకములైన యనర్థములకు గుఱియగుదువు. వినాశకాల మున విపరీతబుద్ధి పుట్టుట ప్రపంచధర్మము. చక్కఁగా యోజించి నా సొమ్ము నిమ్ము.

శం—నీ వేమి చేయఁగలవురా! క్షుద్రా!

అ—చూడుము.

ఇట్లుపలికి, యర్థపరుఁడు సత్వరముగ రత్నాకరమును విడిచిపోవు టకు తిరుగఁగా నొక తుపాకి శబ్దము వినఁబడెను. ఆక్షణముననే యర్థ

వరుఁడు నేలఁగూలెను. అప్పుడు శంబరుఁడు 'ఈ పాపి హతుఁడయ్యెను. నా రహస్యప్రవర్తనములను గ్రహించినవాఁడు వీఁ డొక్కఁడే. ఇతని శవము నేకాంతముగఁ బూడ్చిపెట్టవలెను. లేనిచో నల్లకల్లోల మగును. ఇతని కుణపము కళింగాదుల కంటఁబడిన నాగతి యేమి?' ఇట్లు తలఁచుచు దిగ్భ్రమచే మూఢునివలెఁ గొంతసే పుండెను.

---

## అ ధ్యా య ము. 16.

—)o(—

పరంతపుఁడు సారంగము మార్గమున రత్నాకరమునుండి సాయం కాలమునందు వేషధారియై యాగృహారాజమునకు వెడలెను. అచ్చటి కావలివాఁడు, నీ వెవరు? ఏలవచ్చితివి? అని యడిగెను.

ప—నేను శంబరదర్శన కుతూహలుఁడను.

కావ—ఈ రేయి నీయభీష్టసిద్ధియగుట యసాధ్యము.

నాకార్యము చాల ముఖ్యమని పరంతపుఁడు వచించి యొకలేఖ నతనికిచ్చెను. దానిలో నిట్లు లిఖింపఁబడి యుండెను.

అయ్యా! శంబరా!

సుమిత్రుని కిమ్మని యతని సఖుఁడగు జయపాలుఁడు పదివేల రూప్యములను నా పరముగా నిచ్చి కాలధర్మము నొందెను. ఆసొమ్ము నిచ్చుటకుఁ గల్యాణపురము వచ్చి కనుఁగొనఁగా, సుమిత్రుఁడు స్వర్గస్థుఁడైనట్లును, నతని వారసుఁడవు నీవనియు గ్రహించితిని. నాకు వేఱుపని యున్నందున నిన్నుఁ దక్షణమే దర్శింపఁ గోరుచున్నాను.

ధర్మపాలుఁడు.

కావలివాఁ డీకాగితమును శంబరుని హస్తమునకుఁ జేర్చెను. ధర్మపాలునిఁ బిలుచుకొనిరమ్మని శంబరుఁ డుత్తరువుచేయఁగా, కావలివానితోఁ

బరంతపుఁడు లోనికిఁ బోయెను. పరంతపుని శంబరుఁడు సత్కరించి, "నాకు రావలసిన సొమ్మును దెచ్చితిరా?" యని ప్రశ్నించెను.

ప—అది కల్యాణపురములోనున్నది. వారసుదారు సర్టిఫికేటు, రసీదు, ఇచ్చినచో సొమ్మును మీకొప్పగించెదను.

శం—మీరు కల్యాణపురమునకు వచ్చినందులకు నేను గృతజ్ఞుఁడను. నాసత్కారము నంగీకరించి, కళింగునితో సంభాషించుచు, నీ రేయి యిచ్చట గడపుఁడు. మీభోజనాదుల యేర్పాటును జేసి, తిరిగి వచ్చెదను.

శంబరుఁ డిట్లు పలికి, సమరసింహునిగదికి పరంతపునిఁ బంపెను.

ఇంతలో కామమోహిని దాది శంబరుని సమీపించి, "కామమోహినితండ్రిని రత్నాకరమునుండి విడుదల చేసినపక్షమున నామెనిన్ను వరించుట కంగీకరించినది" యని నుడివెను.

శం—నీయుపకారమునకు నేను సంతుష్టుఁడను. వివాహానంతరము నీవు కోరు పారితోషికము నిచ్చెదను. శుభకార్యము శీఘ్రములో జరుగునని కామమోహినికిఁ దెలుపుము.

ఈ సమాచారమును కామమోహినికిఁ దెలుపఁగా నామె యిట్లు తీర్మానించుకొనెను. "వివాహప్రారంభమునకు పూర్వము నా తండ్రిని రత్నాకరమునుండి వెలుపలకుఁ బంపెదను. పిదప నే నాత్మహత్య కావించుకొందును." ఇంతలో శంబరుఁడు వచ్చి 'ఓ ప్రాణకాంతా! నీయిష్టప్రకారము నీమనోరథసిద్ధి జేసెదను.' అని పలికి, కామమోహిని తండ్రిని రత్నాకరమునుండి విడుదలచేసి, యతనికిఁ గొంతద్రవ్యమును నిచ్చెను. అతఁ డాద్రవ్యమును ద్రిప్పివేసి, 'నాకు ద్రవ్యముమీఁద, నాశ లేదు. నీవే దీనినుంచుకొనుము. నీవిప్పటికైనను దుర్మార్గప్రవర్తనను వదలి

పరస్త్రీమీఁద నాశవిడువుము. లేనిచో నీదుష్కృత్యఫలము ననుభవించెదవు". అని కల్యాణపురమును బ్రవేశించెను.

శంబరుఁడు స్వగృహమునకుఁ బోయి, వివాహమహోత్సవ ప్రయత్నములను జేయ నుద్యుక్తుఁ డయ్యెను. ఇంతలో మంజీరకుఁడు కామమోహిని గదియొద్ద నున్న ద్వారపాలకుని నోటిలో బట్టలు తుఱిమి, వాని కాలుచేతులు బంధించి, యటులనే కామమోహిని దాదిని వివశురాలుగఁ జేసి, తనభటుల నిద్దఱ నచ్చట నియమించి, పరంతప సమరసింహులు తప్ప మఱియెవ్వరు వచ్చినను తుపాకితోఁ గాల్చుఁడని చెప్పి, 'నీకష్టములు ముగిసినవి. ఆత్మహత్య చేసికొనుటకు నుంచినవిషమును బాఱబోయుము. ఒక్క యరగంటలో పరంతపునిఁ బిలుచుకొని వచ్చెదను'. అని కామమోహినితో నుడివి, ప్రత్యుత్తరమును గూడ నిరీక్షింపక, సమరసింహునియొద్దకుఁ బోయి, 'అయ్యా! ఈ కిరాతుఁడిప్పుడే యర్థపరుఁ డను న్యాయవాదిని వధించియున్నాఁడు. వీని నిప్పుడే పట్టుకొనవలెను. ఇట్లు చేయుటకుఁ బూర్వము రత్నాకరపు ద్వారపాలకులను నలుగురను బంధింపవలెను.' అనెను.

స—ఈకార్యమునకు నీకంటె సమర్థులెవరు ?

ప—నీసాహాయ్యార్థము నేనువచ్చెదను.

స—మీకు విజయసిద్ధిరస్తు! పోయిరండి.

పరంతపమంజీరకులు పోయి, నలుగురు ద్వారపాలకుల యాయుధములను బలాత్కారముగ లాగుకొని, వారిని బంధించి, నేలమీఁదఁ బడఁద్రోసిరి. పిదప సమరసింహుఁడు తన మేజస్ట్రేటు ఉడుపులను ధరించి, తనతోడి యిద్దఱకును వారి పోలీసు ఉడుపుల నిచ్చి, శంబరుని సమీపమునకుఁ బోయెను.

శం—మీ రెవరి యనుమతిని లోనికి వచ్చితిరి ? వెడలిపొండు

స—ఓరి నీచుఁడా! ఈసంస్థానాధిపతి యాజ్ఞచొప్పున ని న్నవ ధాధిగఁ బట్టుకొన్నాను. నీకాలుసేతులకు శృంఖలలు వేయవలెను.

శం—నే నేమి యపరాధముల నొనర్చితిని?

మం—పెక్కు ఖూనీలను జేసి, యింతవఱకుఁ దప్పించుకొంటివి.

శం—ఓసమరసింహాది దుష్టులారా! నాకు మీరు శృంఖలలు వేయువారా? మిమ్ముల నందఱను నీదుర్గమునకు బలియిచ్చెదను.

తోడనే రౌద్రాకారుఁడై, పిడుగువలె మంజీరకునిపైఁ బడి వానిని నేలఁ ద్రోసి, సమరసింహాదులు తన్నుఁ బట్టుకొనుటకు ముందే పరుగిడి యింటికిఁ బోయెను. ఆసమయమునకు సరిగా కళావతి కవాటము నొద్దనుండెను. అప్పు డేమియుఁ దోఁచక శంబరుఁడు కళావతిపైఁబడి యామెను నేలఁ ద్రోసెను. కళావతిమీఁద బడుటకు జూచిన పరంతపుఁడు కళావతినిఁ గాపాడుటకుఁగాను తన తుపాకినిఁ బేల్చెను. అతని తుపాకి గుండుదెబ్బ శంబరునికిఁ దాఁకి, యతఁడు నేలఁ గూలి ప్రాణము విడిచెను. పరంతపసమరసింహులు తిరిగి రత్నాకరమునకుఁ బోయి, గదు లన్నిటినిఁ బరీక్షించి, వేఱువేఱు గదులలో బంధింపఁ బడియుండిన సత్యశర్మను, సత్యవతిని, ఆర్యకీర్తిని, విడుదలచేసిరి.

పై సంగతు లన్నిటిని సమరసింహుఁ డాసంస్థానప్రభువునకు విన్నవించెను. ఆప్రభు వీయాశ్చర్యకర మగు కథనువిని, కామమోహిని పాతివ్రత్యమునకును, కళావతి సాహసమునకును, బరంతపుని సౌజన్యమునకును, మంజీరకుని సేవాతత్పరతకును, సమరసింహుని కార్యనిర్వాహణ సమర్థతకును, సత్యశర్మాదుల యుపకారస్వభావమునకును మెచ్చి, వారి నందఱను గౌరవించి పంపెను.

పరంతప కామమోహినులు తమకు తటస్థించినవిపత్పరిహారార్థము గ దేవతారాధన సంతర్పణములనుజేసి, మాధవమరణదానపత్రమందలి

ధర్మముల నన్నిటినిఁ జక్కఁగా నెఱవేఱు నేర్పాటులు గావించి వాని పై విచారణ క్రమముగ జరపుచు, పరోపకారపరాయణులని చాల కాలము పేరువడసిరి. కళావతి కామమోహినితోఁ గొన్నిదినములు సుఖముగ రత్నాకరమునం దుండెను. అప్పుడు మంజీరక కళావతులకు పరస్పరానురాగ ముదయింపఁగా పరంతపుఁడు వా రిరువురకును పరిణయమహోత్సవము జరిపించి, సుమిత్రుని సర్వస్వమును నావధూ వరుల కిచ్చి, వారి సుఖజీవయాత్ర కేర్పాటులు చేసి, సమస్త జనుల మన్ననలను బొందెను. శుభము. శుభము. సర్వేజనా స్సుఖినో భవంతు. సమస్త సన్మంగళాని భవంతు.

---

రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్, రాజమండ్రి.